2




సంపుట : ౮. విక్రమ, మాఘము : ఫిబ్రవరి, 1941. సంచిక : ౫.

# ఆంధ్రరాష్ట్రసమస్య : రామలింగారెడ్డి పలుకులు

వెనక ఒకసారి శ్రీ బులుసు సాంబమూర్తి మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఉపన్యసిస్తూ మనకు ప్రస్తుతంలో ఆంధ్రరాష్ట్రం వద్దు అన్నాడు. అనేటప్పటికి ఆంధ్రదేశంలో ఒక గాలి దుమారం రేగింది.

శ్రీ సాంబమూర్తి మీద ప్రతికూల వాయువులు ప్రబలంగా వీచాయి. వారు ఆవాయువులికి తట్టుకోలేకపోయారు.

తట్టుకోలేక వారు ఏమి చేశారంటే నేను అల్లా అనలేదు, నేను చెప్పినదానిని ప్రెస్సురిపోర్టరు తప్పుగా నివేదించాడు అనే వాదాన్ని జాలు వార్చారు.

ఆనాడు ప్రెసిడెన్సీ కాలేజీలో శ్రీ సాంబమూర్తి అన్నమాటల వంటివే ఈనాడు మదరాసు లా కాలేజీలో డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి చెప్పాడు.

ప్రస్తుత సమయం ఆంధ్రరాష్ట్ర సంబంధమైన ఆందోళనకు అననుకూలమైందని రెడ్డి నిర్ణయము.

రాష్ట్రంలో ద్వంద్వ ప్రభుత్వం సాగినప్పుడు, రాష్ట్రీయస్వాతంత్ర్యం నడిచినప్పుడుకూడ ఆంధ్రరాష్ట్రసమస్యను అడుగున పడవేసి తిరస్కరించారనే విషయాన్ని శ్రీ రెడ్డి సూటిగా తేల్చి చెప్పాడు.

అయితే వెనక శ్రీసాంబమూర్తి ఈమాదిరి మాటలు పలకడంతోటే అట్టుడికినట్లు ఉడికిపోయిన ఆంధ్రదేశం ఈసారి శ్రీరెడ్డి ఈ మాదిరిగా మాట్లాడినా ఉలుకు పలుకు లేకుండా మిన్నకుంది.

ఏమిటి దీనికి కారణం? ఆనాటి చైతన్యం, ఆనాటి రాష్ట్రకాంక్ష ఈనాడు ఆంధ్రులలో కొరవడడమేనా?

ఈసారి ఆంధ్రులు ఈమాదిరిగా పల్లకుండడంచూసి ఇతరులు ఆంధ్రరాష్ట్రసమస్యను గురించి దురభిప్రాయపడుతున్నారు. అసలు ఆంధ్రులలోనే రాష్ట్రవాంఛ సన్నగిల్లి పోయిందనికూడా ఇతరులు అభిప్రాయపడుతున్నారు.

ఈమాసం మొదటివారంలో స్టేట్సుమెన్ పత్రిక వ్రాసిన సంపాదకీయం గమనిస్తే ఈమాటలోని సత్యం అందరికీ అవగతమౌతుంది.

ఆపత్రిక ఏమంటూవుందో చిత్తగించండి :

“ఆంధ్రరాష్ట్రవిభాగాన్ని ఈ వరకు ప్రతిఘటించిన వ్యక్తుల విషయంలో శ్రీరెడ్డి కఠినాతికర కలితాలయిన మాటలు ఆడినాడని మా అభిప్రాయం.

స్నేహితులుగా వున్నట్టు నటిస్తూ కొందరూ, బహిరంగంగా ప్రతిఘటిస్తూ కొందరూ ఆంధ్రరాష్ట్రసిద్ధి పచేళిమంకాకుండా చేశారని శ్రీ రెడ్డి వాదం.

అయితే ఈసందర్భంలో ఒక్క సంగతిని గురించి ఆలోచించాలి.

ఆంధ్రరాష్ట్రం కావాలని కోరేవారు ప్రత్యేకరాష్ట్రాన్ని తాము కోరడంవల్ల ఉదయిస్తాయనుకొన్న

సమస్యలకంటె గహనమైన సమస్యలేవో ఇప్పుడు ఉదయించాయని తెలుసుకోవలసి వుంది.

రాష్ట్రీయస్వాతంత్ర్యం వచ్చినా ఆంధ్రరాష్ట్ర సమస్యను పెద్దలు ఉదారబుద్ధితో చూడలేదనే శ్రీ రెడ్డివాదంకూడా అంతగా నిలవ చాలిందికాదు.

రాష్ట్రీయస్వాతంత్ర్యం పుట్టి పట్టుమని పదిసంవత్సరాలేనా కాలేదు. ఈ ప్రారంభసంవత్సరాలలోనే ఆంధ్రరాష్ట్రనిర్మాణం వంటి ప్రబలసమస్య పరిష్కృతం కాలేదనడం అంత మెచ్చతగిన విషయంకాదు.

అయితే రాష్ట్రీయస్వాతంత్ర్యపు ప్రారంభదశలో ఆంధ్రరాష్ట్రోద్యమంమీద చన్నీళ్లు చల్లిన నాయకులు ఆంధ్రుల రాష్ట్రవాంఛను త్రుంచివేద్దామనుకున్నవారు కారు; ఆంధ్రులను ఎల్లకాలానికి బానిసలుగా వుంచుకుందామనుకున్నవారున్నూ కారు.

మరోసంగతి. రాష్ట్రీయ స్వాతంత్ర్యం ఏర్పడ్డ తొలిదినాల్లో ప్రత్యేకరాష్ట్రంకోసం పలవరించినవారు ఆంధ్రులు ఒక్కరే కాదు.

కేరళదేశీయులు, కర్ణాటజాతీయులు, చోటా నాగపూర్ ప్రాంతీయులు కూడా ప్రత్యేకరాష్ట్రాల్ని కోరివున్నారు.

ఇంతకూ ఈరాష్ట్రవిభజనల్ని నిరసించినది వైట్‌హాల్ ఒక్కటే కాదు. హిందూదేశంలోని రాజకీయనాయకులందరూకూడా ఆవిభజనకు ప్రతికూలురై వుండినారు. అట్టి విభజనవల్ల 1935-వ సంవత్సరపు ఇండియాయాక్టు ఏర్పరచిన రాజ్యాంగనిర్మాణానికి భంగకారి ఔతుందని వారు అభిప్రాయపడ్డారు.

ఆ నిర్మాణానికి భంగకారులైన ఉద్యమాలకి వేనికిగాని ప్రోత్సాహమీయడం వారికి నచ్చలేదు. అసలు ఆనిర్మాణానికే ఒక తలతోక ఏర్పడలేదు. అట్టి సందర్భంలో ఇట్టి స్థానికసమస్యలికి ప్రాముఖ్యము ఇస్తే కొత్తచిక్కులు రావచ్చు.

ఇప్పుడు ఆంధ్ర ప్రాంతాలలోనే కాకుండా విభాగం కోరిన ఇతర ప్రాంతాల్లోకూడా రాష్ట్రవిభజన పట్ల వున్న ఉత్సాహం చల్లారిపోయింది.

ఇట్లా చల్లారిపోవడానికి యుద్ధం కారణమని తోచవచ్చు. అయితే అదేప్రత్యేక కారణమని చెప్పలేము.

ఏమైతే ఏమి మొత్తంమీద అన్నిచోట్ల రాష్ట్రవిభాగపు ఆందోళన వెనుబాటును పొందింది. అసలు భారతరాజ్యాంగమే కొత్త వెలయింపవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. అందుతో పెద్ద కోరిక చాటున చిన్నకోరికలన్నీ వెనకబడిపోయాయి.

ఇండియాను ఇప్పుడు రెండుగా విభాగించాలనే ఆందోళన ఒకటి బయలుదేరింది. ఈఆందోళన భాషాప్రయుక్తరాష్ట్రవిభజనాందోళనకు కొంతవరకు వేరుపురుగుగా వుంది.

ఈవిషయం ఆంధ్రులకు, కర్ణాటకులకు కొంచెం అప్రియంగా వుండక తప్పదు.

ఐనా ఈ తరుణంలో ప్రత్యేకరాష్ట్రవాదులు తమ కోరికల్ని కొంచెం అదుపులో వుంచుకోవడం మంచిది. ఏమైనా ఇండియాలో కాని, ఇంగ్లండులో కాని ఈ విషయాలు విడివిడిగా పరిష్కృతాలు కాజాలవు.

పైకి కనిపించడానికి ఇవి స్థానిక విషయాలుగా వుండవచ్చు. కాని ఆంతర్యంలో ఇవి అఖిలభారత ప్రాముఖ్యంకలవి. ఇవి ఒక్కప్రదేశపు సరిహద్దుల్ని సమాలోచించేవే కావు. హిందూరాజ్యాంగపు పూర్తి నిర్మాణానికి సంబంధించినవి.''

శ్రీ రెడ్డి భావాలని స్టేట్సుమెన్ బాగా వ్యాఖ్యానించింది.

ఈ సందర్భాలన్నీ తెలుసుకోక శ్రీ రెడ్డి ఇల్లా అన్నాడని అఘోరించి లాభంలేదు.

ప్రత్యేకరాష్ట్రాన్ని సంపాదించడం విషయంలో మనం చాలా ఆలస్యంచేశాము. ఆ ఆలస్యానికి ఫలం ఇప్పుడు అనుభవిస్తున్నాము.

మన నాయకులు తరుణంలో పట్టుబట్టి ఆందోళన సాగింపక మొగ్గమోటపడడంవల్ల మనస్థితి ఈనాడు ఇల్లావుంది.

భారతదేశపురేఖ బయటపడే వరకు ఆంధ్రుల ప్రత్యేకరాష్ట్ర వాంఛ గుంటపువ్వులు పూస్తూనే వుంటుంది.

# తెలుగు దేశంలో పిల్లలు

తెలుగుదేశంలో ఒక్కొక్క కాలానికి ఒక్కొక్క వింత వెర్రి బయల్దేరుతూవుంటుంది. కొన్నాళ్ళాయె మన వాళ్ళకి 'పిల్ల'ల మీద మోజు యెక్కువగా వున్నది. చూడండీ!—

ఆమధ్యని ఒక కవికుమారుడు 'శూద్ర పిల్ల' అనే పద్యవ్యాసం 'భారతి'కి పంపగా, వారు 'శూద్రపిల్ల'ని చిరకాలం తమవద్ద ఉంచుకుని చివరకి 'భారతి'లో తావు ఇవ్వకుండా తిరగొట్టేశారని చెప్పి, ఆ కవి అలజడి లేపెట్టి ఝుంకారంచేశాడు.

... ... ...

'యెంకివటి పిల్ల
లేదోయ్, లేదోయ్!'

అంటూ శ్రీనాయని సుబ్బారావుగారు తన ముద్దుల మురిపెంపు యెంకిని ఆంధ్రమాతకి అర్పించి ధన్యుడైనాడు. అంతేకాదు. యెంకి పాటల రచనతో తెలుగు వాఙ్మయంలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభంచేశాడు.

... ... ...

మొదట్లో శ్రీగూడవల్లి రామబ్రహ్మంగారు 'మాలపిల్ల' ఫిలిమ్ తీశారు. అది దేశంలో గొప్ప అలజడిని కలఁజేసిన విజయవింతమైన చిత్రం. నిజానికి 'మాలపిల్ల' తెలుగుసీమలో గృహనామమై వెలిసిపోయింది.

... ... ...

ఈ పాప్యులారిటీని ఊతగా తీసుకుని బట్టలవర్తకులు 'మాలపిల్ల' చీరలు తయారుచేశారు. ఈ చీరలకోసం తపించని గృహలక్ష్మి లేదంటే అతిశయోక్తి కాదు.

... ... ...

ఈ పేరు నలుగుతూవచ్చిన కొద్ది మాసాలకే శరశ్చంద్రుని నవలను శ్రీవేలూరి శివరామశాస్త్రిగారి 'బాపనపిల్ల' పేరుతో 'ప్రజామిత్ర' సీరియల్‌గా ప్రకటించింది.

... ... ...

మరి, మనసులో వుద్దేశ్యమేమిటో కాని, దుర్గాపిక్చర్సు అనే వొక సినిమా కంపెనీ బయల్దేరి, మేము 'కమ్మపిల్ల' ఫిలిమ్ తీస్తామంటూ ఒకటిన్నర పత్రికలలో చిన్న ప్రకటన వొకటి లోకంలో పడవేసింది. కాని ఆ 'కమ్మపిల్ల'గతి యేమయిందో ఇంతవరకూ పత్తా యేమీ తెలియరావడం లేదు.

... ... ...

ఇంతలోనే—'పెంకిపిల్ల'అనే వొక తెనుగు సినిమా మాసపత్రిక మద్రాసునించి మొన్ననే వెలువడింది. అదే పేరుతో ఇపుడొక తెనుగు ఫిలిమ్ రాన్నది. ఈ 'పెంకిపిల్ల' పెంకితనమేమిటో కొన్నాళ్లుపోతేగాని చెప్పలేము.

---

## సుభాషితాలు

దయాధర్మంగా తెచ్చుకోగల దానిని దేనినికాని హక్కువున్నట్లుగా అడగకద్దు.

—*Churton Collins*

ఉత్తమమైనదానిని తెలిసికోవడమూ, అది ఉత్తమమైనదని తెలిసికోవడమూ– ఈరెండే జీవితంలో జయాన్ని కూర్చేవి.

—*Mackail*

చిన్నతనంలో ఆడపిల్లలు రంగురంగు బొమ్మలంటే ప్రియంపడతారు; మగపిల్లలు యుద్ధభటులంటే మోజుపడతారు. పెద్దవాళ్లు అయాక మగపిల్లలు యుద్ధభటులవుతారు. ఆడపిల్లలు పెద్దవారయాక యుద్ధభటులంటే మోజుపడతారు. యుద్ధభటులుమాత్రం రంగురంగుల బొమ్మలవెంట (ఆడవాళ్ళవెంట) పడతారు. వయోభేదంతో రుచిభేదం కూడా వస్తూవుంటుంది.

—*The Leaderpost*

మితభాషిగావుండడంవల్ల ఇతరులకు కష్టంగా వుంటుంది. కాని మితభాషిగా వుండకపోతే మాత్రం బహు ప్రమాదం.

—*Lord Chesterfield*

రత్నాలని పౌనురాళ్ళతో తూచరు. అల్లే సుభాషితాలని వాక్యాలపొడుగుని పట్టి నిర్ణయించరు.

—*Anon*

స్నేహం అనే అక్షరాలు అమ్బులో చూస్తేనేచాలు హృదయం ఏదో నిండుగావుంటుంది.

—*Augustine Birrcal*

దేవుడు సర్వకాల సర్వావస్థలయందూ దాతే. ఆదాత ఇచ్చే వస్తువులలోకి అంతటికీ శిశువు విలవఐంది. శిశువుకంటె సుందరమైన వస్తువు మరిఒకటి వుందా?

—*Anon*

మౌనం ఒక ప్రబలమైన అస్త్రం. దానిని సవ్యంగా ప్రయోగించే దార్ఢ్యం మనలో చాలామందికి లేదు.

—*Violet jacob*

## ఆరోగ్యవిజ్ఞానం

పళ్ళలో, కూరలలో ప్రాయకంగా మూడువంతులు నీళ్ళే వుంటాయి. వాటిలో లోహలవణాలు వుంటాయి కొబట్టి వాని విలువ హెచ్చుగా వుంటుంది. ఈ లోహలవణాలు రక్తశుద్ధిచేసి ఎముకల్ని గట్టిపరుస్తాయి.

... ... ...

బాగా ఆరోగ్యంలో వున్న శిశువులు మూడునెలలకు తల నిలపగలిగి వుండాలి. ఆరు నెలలకు ఇతరుల ఆసరాలేకుండా కూచోగలిగి వుండాలి. తొమ్మిది నెలలకు విద్దెం చేయగలిగి వుండాలి. ఏడాదికి ఎదురు నడవాలి.

## విజ్ఞానవిషయాలు

నిప్పుకోడి సగటు జీవితం ముప్ఫయి సంవత్సరాలు.

... ... ...

ఈకలకోసమని నిప్పుకోడిని పట్టి పెంచుతారు. అట్టి నిప్పుకోడి ఏడాదికి రెండు మొదలు నాలుగు పౌనుల ఈకలు ఇస్తుంది.

... ... ...

కొలంబియాలు మూడు వున్నాయి. ఒకటి : కొలంబియా పేరుతో దక్షిణ అమెరికాలో వున్న రిపబ్లిక్. రెండు: డిస్ట్రిక్ట్ ఆఫ్ కొలంబియా. అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజధాని ఐన వాషింగ్టన్‌గల తావునకు డిస్ట్రిక్ట్ ఆఫ్ కొలంబియా అని పేరు. మూడు : కెనడాలో ఆపేరుతో ఒక రాష్ట్రం.

... ... ...

పాశ్చాత్యుల సేనావిభాగాల నామాలు తరతమ భేదాల్నిపట్టి కిందివిధంగా వుంటాయి : ప్లటూన్, బెటాలియన్, బ్రిగేడ్, డివిజన్. అంటే అన్నటికంటె ప్లటూన్ చిన్నది, డివిజన్ పెద్దది.

... ... ...

ఉత్తరాలు మోసుకుపోయే పావురము ప్రయాణమధ్యంలో ఎప్పుడుకొని ఆహారం తీసుకోదు. చేయవలసిన ప్రయాణం చాలా దీర్ఘమైనదైనా అంతే. దీర్ఘప్రయాణం చేసిచేసి అది వాడి వత్తై వస్తుంది.

అప్పుడు కనక దానికి తినడానికి గింజలు ఏమైనా ఇస్తే వానిని తినడానికి అది నిరాకరిస్తుంది. ఆసమయంలో అది కొసిని నీళ్లుమాత్రం తాగి పడుకుంటుంది. రెండుమూడు గంటల తరవాత అది కొద్దికొద్దిగా గింజలు తినడానికి ప్రారంభిస్తుంది. తినినవెంటనే తిరిగి పడుకుంటుంది.

... ... ...

ఆస్ట్రేలియాఖండంలో ఆరురాష్ట్రాలు వున్నాయి. వానిపేళ్లు—1 న్యూసౌత్ వేల్సు, 2 సౌత్ ఆస్ట్రేలియా, 3 వెస్టరన్ ఆస్ట్రేలియా, 4 క్వీన్సు ల్యాండ్, 5 విక్టోరియా అండ్ టాస్మానియా, 6 నార్తరన్ టెరిటరీ.

# అమ్మవార్లని హడలగొట్టాడు

సూరయ్య అమాయకుడే
కాని పోలేరమ్మను బెదిరించాడు
పోతరాజు పొగరు అణిచాడు
కాటేరిని భయపెట్టాడు
వారిని తన సేవకులుగా చేసుకున్నాడు.



కథకుడు :

## పురాణం పిచ్చయ్యశాస్త్రి

వీరయ్య సూరయ్య అన్నదమ్ములు. ఇద్దర్లో వీరయ్య పెద్దవాడు. కొంచెం యేదో వీధిబడిలో చదివి డొక్క శుద్ధిచేసికొని యుండేవాడు. సూరయ్య నిరక్షరకుక్షి. అయితే దేహపటుత్వంగలవాడు. ధైర్యశాలి.

వాళ్ళ తల్లిదండ్రులు చిన్నతనంలోనే వాళ్ళకి పెండ్లిండ్లుజరిగించి, కోడళ్లు కాపరానికి వచ్చిన తర్వాత కొలదికాలంలోనే దివంగతులైనారు. తల్లిదండ్రులు పోయినంతట వీరయ్య సూరయ్యలు స్వతంత్రులైనారు.

కాని పిత్రార్జితం ఆస్తి బోషాణంపెట్టె, బత్తె ఒకటి, కాపురం ఉండే పూరిల్లుమాత్రం ఉండింది. ఇదే వాళ్ళకు తండ్రి పెట్టిపోయిన ఆస్తి.భూమి పుట్రలుగాని, సొమ్ముగిమ్ముగాని మరేదిన్ని లేదు. తండ్రి బతికియుండంగానే యేదో ఉండిన కాస్తకూస్త హరణమైపోయింది.

వీరయ్య సూరయ్యలు లేమిడివల్ల నానాకష్టాలకు పాత్రులైనారు. దరిద్రానికి తోడుగా, వారి భార్యల కొకరికొకరికి పొందు పొసగకపోయింది. వీరయ్యభార్య జానకమ్మ. సీతమ్మ సూరయ్య పెండ్లాము.

జానకమ్మ నిండా కోపగత్తె. గయ్యాళి. తగవులమారి. గిల్లి జగడానికి లాగడంలో ఆమెను చెప్పియింకొకరిని చెప్పవలసింది లేదు. సీతమ్మ అట్టిదికాదు. కొంచెము, ఓర్పున్ను- గురువు, దైవం, పెద్ద చిన్న అనే తారతమ్యమూ తెలిసి వర్తించేది.

ఇందువల్ల తోడికోడళ్ళకు ఒద్దిక కుదర లేదు. ఎప్పుడూ యింట్లో ఒకటే పోరు. ఒకటే చీదర. ఏదో సాకుబెట్టి జానకమ్మ సీతమ్మను జగడానికి లాగుతూవుండేది. కపటపట మొగుణ్ణి రహస్యంగా పిలిచి యేమేమో చెప్పి మనస్తాపం గలిగించింది, అన్నదమ్ములకు.

వీరయ్య కొంచెం చదువుకొన్నవాడైనందున ఆగ్రామంలో వీధిబడి పెట్టుకొనిన్ని యెవళ్ళకైనా లెక్కపద్దులు రాశిన్ని నెలకు నాలుగురాళ్లు సంపాదిస్తూవుండేవాడు.

సూరయ్య కేపని చేయడానికి తెలియదు. అంచేత యింట్లోనే ఉండి బఱ్ఱెకు కసువు తేవడం—కూరపాదులకు నీళ్లుపోయడం ఈలాంటి పనులు చేస్తూండేవాడు. తనమొగుడు సంపాదించి తేవడం—మరది, ఆతడి పెండ్లామున్ను భోంచేస్తూవుండడం—చూచి చూచి జానకమ్మ ఓర్వలేకపోయింది. వారిబాధ తప్పించుకోవాని కుపాయం ఆలోచించింది. మొగుడికి లేనిపోని మాటలుచెప్పి వాళ్ళతో కూడావుంటే కోలుకోబొయ్యేది లేదని దుర్బోధనజేసి, కాపురం చీలదీసే ప్రయత్నం చేసింది రహస్యంగా.

వీరయ్య పెండ్లాం మాటలకు లొంగిపోయి సరేనన్నాడు. ఆనాటి రాత్రే సూరయ్యనుపిలిచి "ఇంక కూడావుండడానికి వీలులేదు. ఏదో వుండినమట్టుకు మనం పంపకంచేసుకొని రేపటినుండి యెవరిమట్టుకు వారు వేరువేరుగా వుండవలసిం"దని గట్టిగా చెప్పేశాడు.

అదంతా జానకమ్మ చేసిన తంత్రమని సూరయ్యకు తోచలేదు. కాని సీతమ్మ తెలుసుకొంది. అయితేమాత్రం ఆమె యేమిచేస్తుంది. సంపాదించేవా డాలాచెపుతూవుంటే. భార్యాభర్త లేమిన్ని నోరు తెరవలేదు. ఆ రాత్రి గడిచింది.

తెల్లవారంగానే వీరయ్య యిద్దరు పెద్దమనుషులను పిల్చుకొచ్చాడా వూళ్ళోవాళ్ళని. తమ ఆస్తి పంచిపెట్టమని చెప్పాడు వీరయ్య వాళ్ళతో, ఉండేది పెద్దపెట్టె —ఎనుము—ఇల్లు పూరికప్పినది. మధ్యస్తులు యిల్లు చెరిసగంపంచి హద్దులు పెట్టారు.

ఇంక బోషాణప్పెట్టె, బఱ్ఱె ఉన్నవి. జానకమ్మ తమభాగానికి పెట్టె తీసుకోవాలిసిందని, యెనుమును మెడకు కట్టుకుంటె దానికి గడ్డి, కుడితినీళ్లు పెట్టి పోషించాలసుంటుందని, అట్లా కష్టపడ్డానికైనా అదికట్టి యీనేది కాదనిన్నీ, గొడ్డుబఱ్ఱెయనీ, దాన్ని సూరయ్యభాగానికి తట్టేయాలసిందని, మొగుడి చెవులో గుసగుస చెప్పి ఊదింది.

అతడు సరేనని పెద్దమనుషుల యెదట తమ్ముణ్ణి పిలిచి "నే నేదో విధంగా బడిచెప్పుకొంటూ జీవిస్తాను. నీకు యేపని తెలీదు. కాబట్టి యెనుమును నీవు తీసుకో. నేను పెట్టె తీసుకొంటాను. బఱ్ఱె చూడైయీనిందంటే నీకు కొంచెం దానివల్ల, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి మూలంగా లాభం యేర్పడుతుంది" అని చెప్పాడు.

సరేనన్నాడు సూరయ్య బదులు చెప్పకుండా, వీరయ్య చెడ్డతలంపు సూరయ్య తెలిసుకోలేకపోయాడు. తనపైగల ప్రీతిచేతనే ఇలా చెప్పాడనుకొన్నాడు పాపమా మేదకుడు. పంపకం అయిపోయింది.

దానికిగాను వచ్చినవాళ్లు పోయ్యారు.

మరునాడే యింటికి సగం భాగానికి బెట్టించింది గోడ జానకమ్మ. సూరయ్య సీతమ్మ వేరయ్యారు. పూటకు గతిలేదు యేంచేస్తారు వాళ్లు? సూరయ్య ఉపాదానానికి ప్రారంభించాడు. ఆ వరుమానమే వాళ్ళకు ప్రాణాధారం. గంజిగానో, అంబలిగానో దొరికినదాన్ని కాచుకొని తాగి కృష్ణా- రామా అంటూ మళ్ళీ మఱునాడా వేళవరకూ ఆవంటిపూట గంజితోనే వుండేవారు యిద్దరున్నూ.

సూరయ్యకు మధ్యాన్నంమీదట అటునిటు పోయి గడ్డిసంపాదించుకొని వచ్చి తన పాలికివచ్చిన యెనుమును కాపాడ్డంతో సరిపోతుండేది పొద్దురవంతాను.

ఏమిచేసినా యేమిలాభం? ఆ పాడుబఱ్ఱె కట్టునిలిచి చూడయింది గాని, యీనిందిగాని లేదు. మీదు మిక్కిలి యెంత గడ్డి తెచ్చినా చాలేదిలేదు. బాగాతిని తెగబలిసి యేనుగుగున్నవలె ఏర్పడింది నల్లగా నూనెపూసినట్లు. దానిమూలాన ఏమైనా లాభంగలుగునంటూ ఆశపడుతూ వుండినవారి కోరిక కొనసాగిందికాదు. కొన్నినాళ్ళయినంతట ఆశ నిరాశజేసుకొని యెవళ్ళకయినా అమ్మేయాలని బేరంసాగించా రాసతీపతులు. అది గొడ్డుబఱ్ఱెయని యందరికీ తెలిసియుండేందుచేత యెవరుతీసుకోడానికి సమ్మతించలేదు. ఆ ఆశపోయింది. ఇంకాచూతామని మనస్సమాధానం చేసుకొని వాళ్లు దాన్ని పోషిస్తూ అది నల్లగా బలిసివుండడంచేత దానికి కాటేరియని పేరుబెట్టి పిలుస్తూండేవారు. ఆపేరుతో పిలిస్తే తన్ను పిలుస్తారని అదిన్ని వాడుకచేత తెలుసుకొంటూవుండేది.

ఇట్లు కొన్నాళ్లు జరిగింది. ఒకనాడు వంటరిగా కూర్చొని తమ కష్టాల్ని తలంచుకొని యోచిస్తూ వుండింది సీతమ్మ. అపుడామెకొక యుక్తితోచింది. ప్రయత్నంచేస్తే, ఒకవేళ దేవుడు కరుణిస్తే—మూద్రాం— ఏమైనా— తారకం— ఊరికే వుండడానికంటె ప్రయత్నం చేయడం మంచిదికాదా? తప్పిదం యేముంది అనుకొన్నది తనలో తాను.

మొగుడు వచ్చినంతట చెప్పింది తనయోచన యీలాగని "మీరు యీబిచ్చపునూకలు దోసెడు తెస్తే మనకు కాలం గడవదు. పస్తులుండి మన మల్లాడలేము. నేనొక ఉపాయంచెప్తా. నామాటప్రకారం చేయండి. భగవంతుడు మంచిమా

పుచూస్తే ఒకవేళ మంచికలిగినా కలుగవచ్చు. కలుగకపోతే వచ్చే నష్టం యేమిన్నిలేదు. వేరే ఆలోచించకుండా మీరు గ్రామాధికారి దగ్గరకుపోయి, కొంచెము నేల మేడిపాలి సేద్యానికని అడగండి. మన పేదరికం యెరిగివుండేవాడు కాబట్టి యిస్తాడని నాకు నమ్మకం వుంది. భూమి దొరికిందంటే మరి యెవళ్ళనైనా కొంచెంసేపు యెద్దుల్ని నాగేలు కలప యిమ్మంటే యిస్తారు. కష్టమనకుండా దున్ని పయిరుపెట్టుకొంటే యేపుట్టైతో, పంటమో పండుతుంది. కోర్తుపోగా వచ్చే మేడిపాలుగింజలు పెట్టుకొని కొన్ని దినాలైనా వెళ్ళబుచ్చవచ్చును. ఊరుకుంటే యెట్లామతి? ఏదైన పనిచేసుకొంటేగదా? ఇది మంచి వుపాయం. నేడే ప్రయత్నించండి'' అని నచ్చచెప్పింది ఆ యిల్లాలు.

కష్టాలపాలై అల్లాడుతుండే సూరయ్యకు పెండ్లాము చెప్పిన యోచన బాగానేవుందని తోచింది. అయితే భూమి యెవరిస్తారు? ఎద్దులు నాగేలు కలప యిచ్చేవాళ్ళెవళ్ళు? ఒకవేళ అన్నీ దొరికినా, యెన్నడుగాని సేద్యం చేసి యెరుగనివాడను యెట్లా దున్ని పైరుపెట్టగలను?'' అని ఆలోచించాడు.

ఐనా భార్యచేసే తొందర పడలేక గ్రామాధికారియింటికి పోయాడు. అప్పట్లో వాకిట్లోనే కూర్చొనియుండినాడా పెద్దమనిషి. సూరయ్యదగ్గరకు పొయ్యాడు. ''ఏమి? సూరయ్యా! వచ్చావు?'' అని యడిగాడు. సూరయ్య అడగలేక గుటకలు మింగుతూ యేలాగో మనస్సు సమాళింపుచేసుకొని ''మతీ—మతీ— మతేమిన్నిలేదు. పూటగడవక నిండా కష్టం పడుతున్నాను. నాకు దయతో మీరు కొంచెం పొలం యిస్తే దున్ని పైరు పెట్టుకొంటాను- ఊరికేకాదు—— మేడిపాలికి. పండినదాంట్లో మీకు కోరుపోను, యేదైనా కొంచెం మేడిపాలు గింజలు మిగిల్తే పదికొజులు పొట్టపోసుకొని కాలక్షేపం చేస్తాము. అడగడానికని వచ్చాను——మీదయ'' అని తనకోరిక చెప్పేశాడు సూరయ్య.

గ్రామాధికారి కాయనస్థితిగతులంతా తెలిసినవే!

ఆలా సూరయ్య అడగంగానే అతని కాశ్చర్యం కలిగింది తనలో. ''ఎన్నడున్ను సేద్యంగీద్యం చేసి యెరిగివుండేవాడు కాడు. గొడ్లుగాని, సామానులుగాని, సేద్యబండోలంగాని యేమిన్నిలేదు. ఇతడు వ్యవసాయంచేస్తాట్ట— నేలగావాలట— వెఱ్ఱివాడు—— అమాయకుడు—— ఎవరో——ఈ పిచ్చికలలు పుట్టించి పంపారు!——పాపము. వారి యెగతాళిమాటలు తెల్సుకోలేక వచ్చాడు'' అనుకొని, ఆయనవల్ల యేపని కాదని యెఱిగియుండేవాడు గనుక ''సూరయ్యా! నువ్వు సేద్యం చేయాలనుకొంటే, మందబయట పోలేరమ్మమెట్ట కాళీగా వుంది. దాన్ని దున్నుకోపో'' అని పరిహాసానికి చెప్పాడు గ్రామాధికారి.

అది నిజమే ననుకొన్నాడా వెఱ్ఱి సూరయ్య. ''అడగంగానే అడ్డం చెప్పకుండా ఆపెద్దమనిషి నేల యిచ్చాడుగదా!'' అని సంతోషించాడు.

ఊళ్లో వ్యవసాయంచేసుకొనే వాళ్ళల్లో ఇద్దరుముగ్గురితో జరిగినదైనంచెప్పి దున్నుకోవడానికి నాగేలు కలపసామాన్లు యెద్దులు ఒకనాడు తిరిపెంగా యివ్వాలసిందని బతిమాలుకొన్నాడు.

వాళ్లు సూరయ్యతో గ్రామాధికారి యెగతాళికి చెప్పినమాటలు విని తమలోతాము అతని అవివేకానికి నవ్వుకొని వేడుకార్థం యేమిచేస్తాడో చూద్దాం అని కలియబలుక్కొని రెండుపశువులు, నాగేలు, దానికి కావలసిన సామాన్లు యిచ్చి పొమ్మన్నారు.

సూరయ్య సంతోషంతో ఊరిబయటికిపోయి పోలేరమ్మ మెట్టలో, నాగేటికి యెద్దులుకట్టి, యెన్నడు దున్నినవాడు కాకపోవడంచేత లోజాలుగా పణతెను నిలిపి, ఎద్దుల నదలించి తోలాడు. ఎద్దులు లాగలేక లాగుతూవుండడంచేత భూమి బద్దలుగా పగుల్తూ పెద్దచాలు ఏర్పడ చొచ్చింది.

ఆగ్రామంలోవాళ్లు యేటేట

పోలేరమ్మకు ప్రబలంగా జాతర చేస్తూండేవారు. అవి సూరయ్య దున్నే చోట్లోనే జరుగుతూవుండేది. అందువల్లనే యాచోటును పోలేరమ్మమెట్టయని యందరూ అంటూవుండేవారు. ఆయాయేడు బచ్చనతో పోలేరమ్మ బొమ్మను చేయించి ఆచోటనిలిపి, ఆకులతో గుడికట్టి జాతరజరపడం— అది అయినతరువాత గుడి తీసివేసి, ఆ విగ్రహాన్ని అక్కడనే పాతిపెట్టి, అంతకుముందు సంవత్సరం పూడ్చియుండే బొమ్మను పెళ్ళగించి యెత్తి పారెయ్యడం ఆవూళ్లో వాడుకగా జరుగుతుండేది.

ఆ వాడుకప్రకారం ఆయేడు జాతర జరిగించి, పోలేరమ్మ బొమ్మను అక్కడ గ్రామంలోవాళ్ళు పూడ్చివుండినారు. సూరయ్య యెద్దుల నదలించి తోలడంలో నాగేటిఆరు పూడ్చియుండే పోలేరమ్మ బొమ్మకుతికకు సరిగ్గా వస్తూవుండింది.

చూచింది పోలేరమ్మ "అయ్యో! మోసంగలిగిందే! చచ్చానే! ఇంక యెట్లా తప్పించుకోవడం? ఈమూఢుడు నాచోటును దున్నడానికి వచ్చాడే! వీడి కింక చోటు లేకపోయిందా?" అని దిగులుపడి తత్తరిల్లసాగింది.

ఏదో సదుపాయంచూచి తప్పించుకోకపోతే వుపద్రవం కలుగుతుంది. ఆలోచిస్తూ చూస్తూవుంటే గ్రామంలో తనకుండే మరియాద తప్పిపోవడమేగాక ప్రాణాపాయం కూడా తటస్థిస్తుంది. తప్పదు. నాగేలు దాపుదాపునకు వస్తూవున్నది ఆమెకు దేహం పదురుబుట్టింది.

సూరయ్య తెలివిలేనివాడని, పట్టుదల విడవనివాడని, వాన్ని బెదరిస్తే ప్రయోజనంలేదని తెలుసుకుంది ఆమె. మంచిమాటల్తో యెట్లానైనా వీణ్ణి లోబరుచుకొని ఈ ఆపద తప్పించుకోవడం మంచిది" ఇట్లాయెంచి మనిషిరూపంతో భూమిలోనుండి తలను నాగేటిచాలుకు ఎదురుగా బయట పెట్టింది పోలేరు. చూచాడు సూరయ్య ఆశ్చర్యంతో—

అతడికి భయం కలిగితేగా? "ఎవరు నువ్వు? ఏరుచాలు కడ్డంగా వచ్చావు. తొలగిపో" అన్నాడు కోపంతో.

"ఈచోటు నాది. నేను పోలేరమ్మ అనే శక్తిని. ఇక్కడ దున్నడం యేమిటి? వెఱ్ఱివాడుగా వున్నావు. ఎవరైన యీచోటు దున్నుతారా? పోపో" అన్నది ఆమె.

సూరయ్య కోపం యినుమడించింది. నిర్భయంగా "ఛీ! ఛీ! తొలిగిపో— శక్తి గిక్తి నాముందు పనికిరాదు. తెలిసిందా? పోలేరమ్మైతే నేం—మఱి యెవరైతేనా కేం— నేను భయపడేవాణ్ణిగాదు. గ్రామాధికారి దున్నపైరుపెట్టుకోడానికి నా కీచోటు చూపాడు. ఎవళ్ళనో బతిమాలి యెద్దులు నాగేలు తెచ్చుకొని దున్నుకొంటూవుంటే యిక్కడ నీ అడ్డం కొంత వుండాలనా? ఆలస్యమైతే పసులు, సామాన్లు కలవాళ్లు తీసుకొనిపోతారు. అంతట నాపనిచెడి నోట్లో వేలు పెట్టుకొని పోవలసిందే. మాటలు పెట్టకుండా, ఆవలికిపో! పోకుంటే కఱ్ఱు నీమెడలో గుచ్చుకొంటుంది— అమ్మా అన్నా, అబ్బా అన్నా లాభంలేదు. చస్తావు. నాతప్పులేదు. చెప్పాను" అన్నాడాయన.

"ఓహో! వీడు జడిసేవాడుగా వుండలేదే" అనుకొన్నది పోలేరమ్మ "సరేగాని, ఇక్కడపైరు పెడితే యెంత పండించగలవు? చెప్పు చూద్దాం" అని అడిగింది.

దేవుడు దయచేస్తే రెండుపుట్ల గింజలైనా పండిస్తానన్నాడతడు.

ఆమె నవ్వుతూ తలాడించి "మంచిదిగాని ఒకమాట చెప్తాను విను"—అన్నది.

సూరయ్యకు కోపంహెచ్చింది. "సరే సరే— బాగా నేవుంది—నీ మాటలు గీటలు వింటూండాన్నికి నాకు సావకాశంలేదు. పోపో! అడ్డంనిల్వాక—ఈ తిరిపెపు యెద్దులు—సామాన్లు— లేకుండా చేయాలనుకొన్నావా?" అంటూ "టుఱ్ఱు—చా" అని ఎద్దుల నదలించి తోలాడా క్రొత్తసేద్దెగాడు.

"ఉండుఉండు. అయ్యో! చచ్చాను— తోలవద్దు నిలుపు యెద్దుల్ని" అంటూ పైకివచ్చే వాటికి చేయి అడ్డంపెట్టి అదిలిస్తూ

[మిగతా ౧౬౧-వ పేజీలో.

# ఆకు కూరలు

31 రకాల ఆకు కూరలను

గురించిన వివరాలు

ఆంధ్రభూమి బుక్కుడిపో,

వేపేరి : మదరాసు.

# ఆకుకూరలు

## ఉపోద్ఘాతము

'శోకేన వర్ధతే వ్యాధిః' అనే శ్లోకోక్తి మనలో సర్వత్రా వ్యాపించి వున్నది. కాని వైద్యశాస్త్రమతం ఈ శ్లోకోక్తికి పూర్తిగా విరుద్ధంగా వుంది.

శాకములు పుష్టిని, తుష్టిని—జవాన్ని, జీవాన్ని ఇస్తాయని మన ఋషులు నమ్మివుండిరి. కావుననే వారు కందమూలాదులు తిని ఆయురారోగ్యాలతో మనినారు. మాంసాహారంకంటె శాకాహారం ప్రశస్తతరమైనదని వారు అనుభవ పూర్వకంగా సిద్ధాంతీకరించారు.

రాజ నిఘంటుకారుడు శాకాల్ని—ఆకు, పూవు, కాయ, కాడ, దుంప అని—ఐదు విధాలుగా విభజించి వున్నాడు.

అందులో ప్రస్తుతం ఆకుకూరల్ని గురించి తెలుసుకోడానికి పూనుకుందాము.

ప్రాణకృత్తు లనే విటమినులను గురించిన పరిశోధన విస్తృతమవుతూవున్న కొలదీ పాశ్చాత్యులుకూడా ఆకుకూరల ప్రాశస్త్యాన్ని బాగా గ్రహిస్తున్నారు.

ఆకుకూరల ప్రాశస్త్యాన్ని మనవారు అత్యంత ప్రాచీన కాలంలోనే అకళించి వుండిరి.

మన స్త్రీలకుకూడా ఆకుకూరల ప్రాశస్త్యం అవగతమైవుండేది. ఆకులను ఒక్క కూరగానే కాకుండా వారు అనేక వైద్యోపయోగాలకి కూడా వాడుతూవుండిరి.

కాని ఈనడిమి కాలంలో మన వారు—ముఖ్యంగా పట్టణాల్లో వుండేవారు—కొంతవరకు ఆకుకూరల ప్రశస్త గుణాల్ని విస్మరించారు. ఇప్పుడిప్పుడు తిరిగి పాశ్చాత్య ప్రముఖుల వ్రాతలవల్ల మన వారి దృష్టి ఆకుకూరలమీదికి మరల వలసినంతగా మరలింది.

మనకు ఇప్పుడింత మేలుచేసిన ఆ వ్రాతలేవో, వాని వివరాలేమిటో కొంచెం తెలుసుకుందాము.

1937 ఆగష్టులో జాతిసమితివారు ఆహారపదార్థాల్ని గురించి ఒక నివేదికను ప్రచురించివున్నారు.

ఆ నివేదిక ఆకుకూరల్ని గురించిఇట్లా చెబుతూవుంది.

'పచ్చి ఆకుకూరలలో బి విటమినులు, ఎ విటమినులు విస్తరించి వుంటాయి. వాటిల్లో సి విటమినులుకూడా హెచ్చే. అయితే పదార్థాల్ని వెచ్చచేయడంలో ఆ సి విటమిన్ హరింపు ఐపోతుంది. ఆకుకూరల్లో విటమినులే కాకుండా లోహాలుకూడా విస్తరించి వుంటాయి.'

మేక్కారిసన్ 'ఆహార' మనే శీర్షిక గల తన గ్రంథంలో ఆకు కూరల్లో అన్ని విధాలైన విటమినులు, అన్నివిధాలైన లోహాలు వున్నాయి అని చెప్పివున్నాడు.

కూనూరులోని ఆహారపదార్థ పరిశోధకాధ్యక్షుడు విటమిన్లను గురించిన తన గ్రంథంలో ఆకుకూరల విషయమై ఇట్లా వ్రాస్తున్నాడు.

'మాక్కలమ్ అనే శాస్త్రవేత్త దేహరక్షక పదార్థాల్లో ఆకుకూరలు పాలతో సమానమైన స్థానాన్ని పొందతగినవని అంటున్నాడు. కాయధాన్యాలలోనూ, పప్పుధాన్యాలలోనూ లేని ఎన్నో దేహరక్షక పదార్థాలను ఆకుకూరలు, పాలు సరఫరా చేస్తాయి.

ఆకుకూరలలో ఇనుము విశేషంగా వుంటుంది. ఏ, బి విటమిన్లు కూడా వాటిల్లో జాస్తీయే. నారింజ కుటుంబపు ఫలాల తరువాత స విటమిన్‌ను సరఫరా చేసే వస్తువులలో ఆకుకూరలే పేర్కొనతగినవి.

ఆకుకూరలు ఎల్లప్పుడూ సూర్యరశ్మిలో వుంటాయి కాబట్టి వానిలో డి విటమిన్ కూడా జాస్తీగా వుంటుంది.

ఆకుకూరలలో ప్రొటీన్ విశేషంగా లేకపోయినా ఉన్నకాస్తా శరీరంలో బాగా కలిసిపోతుంది.

ఇంగ్లండులో ఈ ఆకుకూరల ప్రాశస్త్యం అంతగా గుర్తింపబడలేదు. ఐరోపాఖండంలో మాత్రం ఆకు కూరలంటే అధికతరమైన ఆప్యాయతవుంది. ఇటీవల అమెరికన్లు, కెనేడియన్లు ఆకుకూరల ప్రాశస్త్యాన్ని గ్రహించి లెట్యూసు మొదలయిన ఆదేశపు ఆకుకూరల్ని విశేషంగా తింటున్నారు.

ఆకుకూరల్ని చాలాసేపు ఉడికించడంవల్ల సి విటమిన్ హరించిపోతుంది.

వార్చివేయడంవల్ల వానిలోని లోహ లవణాలు, బి విటమిన్ నాశనమై పోతాయి.'

హచ్చిన్సు, మెక్రామ్ అనే శాస్త్రవేత్తలు ఏకమై వ్రాసిన 'ఆహారం' అనే గ్రంథంలో ఆకుకూరలు లోహ లవణాల్ని, ఎ. బి. సి విటమిన్‌లని సరఫరా చేస్తాయని చెప్పివున్నారు.

ఇండియా గవర్నమెంటువారు ఇటీవల ప్రచురించిన హెల్తు బులెటిన్‌లో ఆకుకూరల్ని గురించి చెప్పిన మాటలు విశేషసమాదరణీయాలుగా వున్నాయి.

'ఒక్కొక్క మనిషి ఒక్కొక్క రోజుకి రెండు మొదలు నాలుగు ఔన్సుల వరకు ఆకు కూరల్ని తీసుకోవడం అవసరం.

విదేశాలకు చెందినవన్నీ, విశేషంగా వెలవుండేవన్నీ అయిన లెట్యూస్, కాబేజి మొదలయిన ఆకుకూరలలో ఎంతటి పుష్టికరపదార్థంవుందో మనదేశపు ఆకుకూరలున్నూ, మిక్కిలి చవకగా దొరికేవన్నీ ఐన తోటకూర, కొత్తిమిరి, మునగాకు మొదలయిన ఆకుకూరలలో కూడా అంతటి పుష్టికర పదార్థం వుంది.

ఆకుకూరలలో లోహాలు, విటమిన్‌లు విస్తరించి వున్నాయి.'

ఆకు కూరల విషయంలో గమనింపవలసిన మెలుకువలు కొన్ని వున్నాయి.

మన వైద్యనిఘంటుకారులు ఆకు కూరలు సాముదాయకంగా వీర్యానికి, కండ్లకు చెరుపు చేస్తాయని చెబుతారు. అయితే ఈకూరలలో పులుసు పెట్టడంవల్ల, సంబారు ద్రవ్యాలతో తాళింపు పెట్టడంవల్ల ఆదోషాలు పోతాయి అని కూడా వారే చెప్పివున్నారు.

ఆకుకూరలకు చీడపురుగులు తరుచుగా పడుతూ వుంటాయి. కూరగా ఉపయోగించడానికి ముందు ఆ చీడపురుగుల్ని జాగ్రత్తగా తొలగించాలి.

ఆకులు చెట్టునుండి కోసిన జాములోగా ఉపయోగించివేయాలి. లేకపోతే వానిలో జీవకారక పదార్థాలు నశించిపోతాయి.

కావున నే ఆకు కూరలు బజారునుంచి తెచ్చుకోవడం కంటె సాధ్యమైనంతవరకు సొంతంగా పెరళ్ళలో పెంచుకోవడమే మంచిదని అనుభవజ్ఞులు చెబుతారు.

ఆకుకూరల్ని ఉపయోగించడానికి పూర్వం సుఖోష్ణమైన ఉదకంలో కడిగి ఒక కొయ్యపలకమీద వేసి ఐదారు నిమిషాలు ఎండలో ఉంచడం మంచిదని శ్రీ ఆర్. వి. లక్ష్మీరతన్ సూచన.

ఆకులలో పసరుపిండి పానీయంగాను, నూరి పచ్చడిగాను ఉపయోగించడం వండి కూరగా ఉపయోగించడం కంటె మంచిదని అతని సలహా.

ఆకుల పసరులో రుచికొరకు తేనె, నిమ్మకాయ రసము, మజ్జిగ మొదలయినవి కలుపుకుని పానీయంగా వాడుకోవచ్చునని లక్ష్మీరతన్ ఉపదేశం.

ఈ సూచనలు, ఉపదేశాలు అన్నీ ఆకుకూరల్ని పచ్చివిగానే ఉపయోగించడానికి చేసినవి. పచ్చిగావున్న స్థితిలోనే ఉపయోగించడంవల్ల వాని ఓషధీగుణం కొంచెంకూడా తగ్గకుండా వుంటుందనడం మినహాయింపులేని సత్యం. ఇటీవల విటమిన్‌ల కోసమని పాశ్చాత్యులు పచ్చిగడ్డిని పచ్చడిగా చేసుకుని తింటున్నారని పత్రికల్లో చదివి ఉన్నాము.

అయితే మనలో నూటికి తొంభై తొమ్మిదిమంది పదార్థాల్ని వండుకు తినడానికి అలవాటు పడివున్నారు. వారిని ఇప్పుడు ఒక్కసారిగా ఆ పద్ధతిని విడనాడమంటే అది ఆచరణ సాధ్యం కాదు.

కాగా వండుకుతినే పద్ధతిలోనే మన ఆకు కూరల గుణాలు లోకానికి తెలియపరచడానికి ఇచ్చట ప్రయత్నిస్తున్నాను.

వంట ప్రమేయం లేకుండానే మనం తమలపాకులు ఉపయోగిస్తాము. ఐనా అవి ఆకుజాతిలోనివి కనుక వానిని కూడా ఇందులో ప్రస్తావించాను. కొత్తిమిరి, కరివేపాకు, వేపాకు మొదలయినవి ప్రత్యేకం వంటకాలుగా మనం ఉపయోగించము. ఐనా అనేకమైన వంటకాల్లో వానిని సువాసనకోరకు, ఓషధీగుణం కొరకు ఉపయోగిస్తున్నాము. అందుచేత వానినికూడా ఈ ఆకుకూరలలో చేర్చినాను.

ఇందులో మొత్తం ముప్ఫయిఒక్క ఆకుకూరల్ని గురించి వివరించాను.

ఇవి అన్నీ కొంచెం ఇంచుమించుగా మనం తరుచు ఉపయోగించేవి, ఉపయోగించ తగ్గవి. వీని గుణాలు అన్నీ ఒక్కచోట చేర్చి చెబితే ఉపయోగంగా వుంటుందనే ఉద్దేశంతో ఇట్లు చ్శేశాను. ఒక్కొక్కదాని ప్రాశస్త్యం తెలియడానికి వానివాని ఓషధీగుణాలు కూడా కూడినమట్టుకు వివరించాను. క్రమంగా కాయకూరలు, దుంపకూరలు మొదలయిన వానిని గురించికూడా ప్రచురిస్తాను.

## ౧ అవిసె ఆకు

అవిసెఆకు కూర తిన్నవాడు అరచిచచ్చును అనే సామెత నెల్లూరు జిల్లాలో వాడుకలో వున్నది. ఈఆకుకూరకు బాగా వేడిచేసే గుణం ఉండడంచేత ఈనానుడి వాడుకలోకి వచ్చిందనుకుంటాను. అంతేకాని ఈ ఆకుకూరను నిషేధించడం వుద్దేశంతో అది పుట్టింది కాదు.

ఏకాదశి ఉపవాసంవుండి ద్వాదశి పారాయణచేసే వారు ఈ ఆకుకూరను తప్పకుండా ఉపయోగిస్తారు. ఉపవాసవ్రతంవల్ల కలిగిన నీరసాన్ని తొలగించే సుగుణం ఈ ఆకుకూరలో వుందని పెద్దలు చెబుతారు.

కూరగానే కాకుండా ఈ ఆకు యొక్క ఔషధోపయోగాలు అనంతంగా వున్నాయి.

అవిసె ఆకులు నూరినముద్ద చర్మంమీద పట్టుగా ఉపయోగిస్తారు. గాయాలకు, దెబ్బలకు అది మంచిమందు.

అవిసె ఆకుల స్వరసాన్ని కొన్ని చుక్కలు ముక్కులో వేసుకుంటే రొంపభారము, తలనొప్పి తగ్గిపోతాయి. ఇట్లా వేసుకోవడంవల్ల ముక్కునుండి జలుబు నీరు బాగా కారిపోయి తలనొప్పి, తలభారమూ శమిస్తుంది. చిన్నపిల్లలకు ఈ ఆకు రసంలో కొద్దిగా తేనెకూడా కలిపి ఉపయోగించడం మంచిది.

పురిటిలో బిడ్డలకు పడిశభారం విశేషంగా ఉంటే రెండుచుక్కల అవిసె ఆకురసంలో ఎనిమిది లేక పది చుక్కల తేనెవేసి రంగరించి మంత్రసానులు వేలితో బిడ్డల ముక్కురంధ్రాల్లో పైపైన నెమ్మదిగా రాస్తారు.

అవిసె ఆకులు బాగా కారంగా, చిరుచేదుగా వుంటాయి. కడుపులోని నులిపురుగులను హరించడములో అవిసె ఆకులు పెట్టినది పేరు. సాలీడు, పురికొస మున్నగు చిన్న విషజంతువుల విషాన్నికూడా ఈ ఆకులు విరిచివేస్తాయి అని చెబుతారు. అవిసెఆకు రసము గవద బిళ్ళలకు పూస్తే అవి కరగిపోతాయి.

రేజీకటి రోగము కలవారికి ఇవి మిక్కిలి గుణకారిగా వుంటాయి. అవిసెఆకు కర్రరోటిలో కర్రబండతో మెత్తగాదంచి కుండలోఉంచి ఉడకబెట్టి రసంతీసి ఆరసాన్ని తులమెత్తు సేవిస్తే రేజీకటి నెమ్మదిస్తుంది.

నాలుగురోజులకు ఒకసారివచ్చే వరుస జ్వరానికి దీని ఆకురసం ఐదారు చుక్కలు ముక్కులో వేసుకుని నస్యంచేస్తే మంచిది. అవిసె ఆకు, మిరియాలు కలిపినూరి రసం పిండి పీలిస్తే అపస్మారంతగ్గుతుంది. ఇది బాలపాప చిన్నెలకు కూడా మంచిది.

అవిసె ఆకుకూర రక్తపైత్యాన్ని తగ్గిస్తుంది. లఘువుగా విరేచనాన్ని చేస్తుంది.

అప్పుడప్పుడు ఈ కూరను ఉపయోగిస్తూ వుండడం మంచిది. మనలో కంటె అరవవారిలో ఈకూర వాడకం హెచ్చు.

## ౨ ఉస్తి ఆకు

దీనిని ఉచ్చింతఆకు అనే పేరుతోకూడా వ్యవహరిస్తారు.

ఉస్తిఆకు కూర మిక్కిలి పథ్యకరమైంది. ఈఆకు కూరను బాలింతలకు కూడా పెడతారు. గర్భవాతాన్ని హరించి పురిటాళ్ళకు ఇది బాగా మేలుచేస్తుంది.

ఉస్తిఆకు శ్లేష్మవాతాల్ని తగ్గించడంలో బాగా పేరుమోసింది. ఈకూర బాగా చేదుగా వుంటుంది. నులిపురుగులను చంపుతుంది. అరుచిని పోగొట్టుతుంది. విరేచనకారి. బుద్ధికి బలాన్ని కలిగిస్తుంది. ఎక్కిళ్ళను పోకారుస్తుంది.

## 3 కరివేపాకు

కరివేపాకును మనం ప్రత్యేకం కూరగా ఉపయోగించం. కాని దీనిని అన్ని వంటకాల్లో సువాసన కొరకు చేరుస్తూవున్నాము. కాబట్టి దీనిని ఆకుకూరల్లో చేర్చి ప్రస్తావిస్తూవున్నాను.

కరివేపాకులో ఆవిరియై పోయే స్వభావంగల నూనె వున్నది.

కరివేపాకు రసాయనకరమైంది. కడుపునకు చాలా మేలు చేస్తుంది.

వికారాల్లో కరివేపాకు రసం బాగా పనిచేస్తుంది. జిగట విరేచనాల్లో కరివేపచిగుళ్లు పచ్చివే

నమిలితింటే గుణకారిగావుంటుంది.

కరివేపాకుల్ని పాలల్లో ఉడికించి ముద్దచేసి విషజంతువుల కాట్లకు, దద్దుర్లకు మందుగా ఉపయోగిస్తారు. జ్వరాల్లో ఇచ్చే కషాయాల్లో కరివేపాకు కూడా వేస్తారు.

సురభినింబ అనేది కరివేపచెట్టు సంస్కృతనామాల్లో ఒకటి. సురభినింబ అనగా వాసన వేప అనిఅర్థం. కృష్ణనింబ అనికూడ దీనికి సంస్కృతనామం వుంది. కృష్ణనింబ అనగా కరి(నల్ల)వేప అని అర్థం.

కరివేపాకులో కారము, చేదు, వగరు అను మూడురుచులు కలిసి వున్నాయి.

కరివేప, మినపప్పు, మిరపకాయలు కలిపి నేతితో వేయించి గుండకొట్టి అందులో తగుమాత్రము ఉప్పువేసి నిమ్మకాయరసం పిండి తయారుచేసిన పచ్చడికి కరివేపాకుకార మనిపేరు. ఈపచ్చడి పైత్యశాంతిని చేసి, నోటి అరుచిని పోగొట్టుతుంది.

కరివేపాకు కషాయము కలరా వ్యాధినికూడా పోకార్చగల సమర్థత కలదని మన వైద్యులమతము.

## ౪ కామంచి ఆకు

దీనిని కాచాకు అనికూడా అంటారు. కాసర, కాసర కూసర, గాజు మున్నగునవి దీని ఇతర నామాలు.

దీని ఆకులు నూరినముద్ద కీళ్ళనొప్పులకు పట్టుగాఉపయోగిస్తారు. ఈముద్దతో నలుగుపెట్టుకుంటే చర్మరోగాలు నెమ్మదిస్తాయి.

కామంచి ఆకుల స్వరసం జలోదరం, హృదయవ్యాధి, చర్మరోగాలు, మూలశంక, సెగరోగము, యకృత్ ప్లీహవ్యాధులు, మండెడు బొబ్బలు మున్నగుజబ్బుల్లో లోనికి సేవించడం మంచిది. మోతాదు అరడ్రాము మొదలు 2 డ్రాముల వరకు.

కాచాకురసంతో తయారుచేసిన మర్బతు జ్వరాల్లో తాగనిస్తే తాపం ఉపశమించడమే కాకుండా బాగా చెమటపట్టుతుంది.

ఎక్కడైనావాచి బాధగావున్నప్పుడు ఆకులు వెచ్చచేసివేస్తే గుణకారిగా వుంటుంది.

ఉబ్బువ్యాధులుకలవారికి కామంచి ఆకుకూర ప్రశస్తమైనది. ఎలుకకాటు విషానికి విరుగుడుగా కామంచి ఆకు స్వరసాన్ని పైన పూస్తారు.

కామంచి ఆకురసము చెవిలో పిండితే చెవిపోటుతగ్గి చీమువుంటే చీముకట్టుతుంది.

కామంచి ఆకుకూర బాగా ఆకలి కలిగిస్తుంది. మేహతత్వం వారికి మేలుచేస్తుంది. త్రిదోషాల్ని హరిస్తుంది. కష్టురోగాన్ని పోగొడుతుంది.

ఈకూర కారంగా, చేదుగా వుంటుంది. అరవవారు దీనిని విశేషంగా ఉపయోగిస్తారు.

## ౫ కాబేజీ

విదేశపు ఆకుకూరల్లో ఇది మిక్కిలి రుచివంతమైనది. చూడ్డానికి కాబేజీ దిమ్మలాగ వుంటుంది. ఆ దిమ్మ కాబేజీమొక్క యొక్క మధ్య ఆకుల అన్నిటి చేరికచేత ఏర్పడినది కాని మరిఒకటి కాదు.

కాబేజీ ఆవమొక్క కుటుంబంలోనిది.

కాబేజీ ఆకుకూర రక్తవృద్ధికరమైంది. కాకచేసి శరీరాన్ని అరుస్తుంది. శీతప్రకృతి కల వారికి కాబేజీకూర మిక్కిలి పథ్యమైనది. తలలో వేడిని తగ్గించి బాగా నిద్రపట్టేటట్లు చేస్తుంది.

మద్యపానంచేత కలిగే మాంద్యాన్ని పోగొట్టడంలో ఇది ప్రశస్తమైంది. కాబట్టి ఇది దొరలకు చాలా ఆప్యాయకరమైన కూర.

కాబేజిలో గంధకపుపాలు ఎక్కువగావుంది. కావుననే వంట సమయంలో ఇది ఒకవిధమైన గబ్బు వాసన కొడుతూవుంటుంది.

శరీరంమీదలేచే పులిపిరికాయలు, చెమటకాయలు, మొటిమలు మొదలయినవి కాబేజీరసం సేవిస్తే తగ్గిపోతాయి.

కంఠం నొప్పిగావుండే జబ్బుల్లో ఐర్లాండు దేశీయులు కంఠానికి పైన కాబేజీ ఆకులు వేసికడతారు.

## ౬ కొత్తిమిరి

కొత్తిమిరిని మనం ప్రత్యేకం కూరగా ఉపయోగించము. ఐనా

పులుసు, చారు, పచ్చళ్లు మొదలయిన వంటకాల్లో దీనిని వాసన ద్రవ్యంగా వాడతాము. కాబట్టి వీనిని ఆకు కూరల్లో చేర్చి ప్రస్తావిస్తున్నాను.

ధనియాల లేత మొక్కలకు మనం కొత్తిమిరి అంటాము. అరవ వారు ధనియాలకు, వాని మొక్కలకు కూడా కొత్తిమిల్లి అంటారు.

కొత్తిమిరి ఆకులు కారంగా, సువాసనగా వుంటాయి.

కొత్తిమిరి గాఢ కషాయంలో పాలు, పంచదార కలిపి ఇస్తే నిత్తురుపడే మూలశంక, అజీర్ణ పిరేచనాలు, అగ్నిమాంద్యము, కడుపులో వాయువు అధికమగుట మొదలయిన వ్యాధులు నెమ్మదిస్తాయి.

కొత్తిమిరి ఆకుల్ని పచ్చిమిరపకాయల్ని తొక్కి తగుమైన ఉప్పు చేర్చి అందులో నిమ్మకాయరసం చేర్చిన పచ్చడి చాలా రుచిగా వుంటుంది. ఈ పచ్చడి పైత్యాన్ని శాంతింపచేస్తుంది...

కొత్తిమిరి త్రిదోషహరమైనది. విదాహాన్ని పోగొడుతుంది. భ్రమను తగ్గిస్తుంది. కొత్తిమిరి మంచి జీర్ణకారి.

కొత్తిమిరి రసాన్ని చనుపాలతో కలిపి కళ్లల్లో కలికంవేస్తే నేత్రరోగాలు నయమౌతాయి. లేదా కొత్తిమిరి వెచ్చచేసి కళ్ళకు వేసి కట్టవచ్చు.

కొత్తిమిరి కషాయంలో పంచదార కలిపి పుచ్చుకుంటే బాగా ఆకలి పుట్టిస్తుంది.

ప్రసవింపబోయే స్త్రీలకు దగ్గరగా కొత్తిమిరిఉంచితే వారు త్వరగా నీళ్లాడుతారు. నీళ్లాడిన తరువాత అచ్చటనుంచి కొత్తిమిరి తీసివేయాలి.

ఆకుకూరల్లో కొత్తిమిరి అతి శ్రేష్టమైనది. ఇది మూత్రాన్ని బాగా జారీచేస్తుంది.

నోరు పూసివున్నప్పుడు కొత్తిమిరి రసంతో పుక్కిలిస్తే మంచి గుణకారిగా వుంటుంది.

## ౭ కోలపాల ఆకు

కోలపాల ఆకు కూర స్త్రీలకు అతి ప్రశస్తమైనది.

గర్భోత్పత్తిని కలిగించేగుణం ఈ కూరలో విశేషంగావుంది. చనుపాలు పడని బాలింతలకు ఈ ఆకు కూర పాలుపడచేస్తుంది.

ఈకూర రుచికి స్వాదుగా ఉంటుంది. కొద్దిగా గురుత్వం చేసే గుణంవుంది. మేహరోగాలలో, నేత్రరోగాలలో ఇది పథ్యకరమైంది. గాయాల్ని మానుస్తుంది. పిత్తరోగాల్ని పోకారుస్తుంది. కుష్ఠురోగాన్ని పోగొట్టుతుంది.

మంచి బలాన్ని కలిగించేశాకం.

## ౮ గుంటగలగర ఆకు

గుంటగలగర ఆకుకూరలో ఇనుము భాగము హెచ్చుగా వున్నది.

ఈ ఆకురసము రసాయనంగా పనిచేస్తుంది. నశ్యంగాకూడా వాడతారు.

గుంటగలగరలో మూడు రకాలు—పసుపు, తెలుపు, నలుపు రంగు పువ్వులు పూసేవి. ఇందులో పసుపు పువ్వులు పూసేరకం ప్రశస్తమైందని చెబుతారు.

యకృత్, కామెల, సవాయి మున్నగు రోగాల్లో ఇది చాలా గుణకారిగా వుంటుంది. గుంటగలగరఆకు నిజరసం ఒకటిన్నర డ్రాముల్లో మోతాదుగా మజ్జిగకాని, నీళ్లుకాని కలిపి పుచ్చుకుంటే పాము కాటుకూడా నయమౌతుందని చెబుతారు.

ఎనిమిది చుక్కల తేనెలో రెండుచుక్కల గుంటగలగర ఆకు నిజరసాన్ని వేసి కొత్తగా పుట్టిన బిడ్డల జలుబు రోగాలలో వాడతారు.

కడుపులో పాములు వున్నాయని అనుమానంగా వున్నప్పుడు ఆముదంతో ఈ ఆకుపసరు కలిపి పుచ్చుకోవడం మంచిది.

చెవిపోటుగా ఉన్నప్పుడు ఈ ఆకు పసరు ఒకటి రెండు చుక్కలు చెవిలో పోస్తారు.

ఈ ఆకులు నూరి ముద్దచేసి తేలుకుట్టినచోట పట్టువేస్తే విషం విరిగిపోతుందని చెబుతారు. చర్మరోగాల్లోకూడా ఈపట్టు బాగా పని చేస్తుంది.

గుంటగలగర ఆకుల పొగ కాని, ఇవివేసి కాచిన నీటి ఆవిరి కాని

పట్టితే మూలశంకరోగం తగ్గుతుంది.

నువ్వుల నూనెలో కాని, కొబ్బరి నూనెలో కాని గుంటగలగర ఆకు రసంపోసి ఆరసం ఇంకిపోయేటట్లు నూనెకాచి దానిని తలకు ఉపయోగిస్తే అకాలంలో తల నెరవడం తగ్గుతుంది. వెంట్రుకలు నల్లగా, నున్నగా తయారౌతాయి.

తలచమురుల్లగా ప్రశస్తమైన భృంగామలక, భృంగరాజతైలాల్లో ఇదే ప్రధానమైన వస్తువు. గుంటగలగరను సంస్కృతంలో భృంగరాజమని, కేశరాజమని అంటారు.

గుంటగలగర జ్వరహరమైనది. నేత్రవ్యాధుల్లో, శిరోవ్యాధుల్లో చాలా పథ్యకారి. కుష్టు, బొల్లి రోగాల్ని కూడా తగ్గించగల ఓషధీ గుణం దీనిలో వుందని చెబుతారు.

ఈ పై ఓషధీగుణ వివరణాన్ని బట్టి గుంటగలగర ప్రశస్తమైనదని అందరికీ అవగతమౌతుంది.

కాబట్టి దీనిని తరుచు కూరగా, పచ్చడిగా ఉపయోగించడం మంచిది. తియ్యకూరగా కాని, పులుసుకూరగా కాని వండుకోవచ్చు.

నీరసస్థితిలో గుంటగలగర సేవనం రోగికి కావలసిన ఇనుమును చక్కగా సరఫరా చేస్తుంది.

గుంటగలగర కన్నులకు చల్లదనాన్ని ఇచ్చే ప్రశస్తమైన శాకము.

## ౯ గోంగూర

ఇది తెలుగువారికి ప్రియతమమైన ఆకుకూరల్లో ఒకటి. పత్రశాకాల్లో ఇది మిక్కిలి ప్రశస్తమైంది.

దీనిలో రాగిపాలు హెచ్చుగా వున్నదని శాస్త్రవేత్తలు చెబుతారు. ఇందులో పొటాష్‌కూడా వున్నది.

ఇందులో పుల్లగోగు, ఎర్రగోగు, తెల్లగోగు (దేశవాళీగోగు), ధనాసరగోగు అని నాలుగు రకాలు వున్నాయి.

పుల్లగోగుకాయలు ఎర్రగా కాని, తెల్లగా కాని వుంటాయి. ఎర్రగోగుచెట్టు కాడలు బూడిద రంగుతో కలసిన పచ్చని రంగుతో వుంటాయి. తెల్లగోగు సర్వసామాన్యమైంది. దీనినే దేశవాళీ గోంగూర అని కూడా అంటారు.

ధనాసర గోంగూర విదేశీది. మలయా ద్వీపకల్పంలో తర్నాసరి అనే రాష్ట్రంవుంది. ఈ గోంగూర ఆదిలో తర్నాసరినుంచి వచ్చింది. తర్నాసరి క్రమంగా ధనాసరి ఐపోయింది.

ధనాసరి గోంగూర బాగా పథ్యకరమైందనీ, బాలింతరాళ్ళకు కూడా పెట్టవచ్చుననీ చెబుతారు.

ఈ నాలుగు రకాలుకాక పైర గోంగూర అని మరి ఒక రకం వుంది. దీనిని శీతాకాలంలో పైరు చేస్తారు. ఈపైరగోంగూర ఇతర రకాల గోంగూరకంటె రుచిగా వుంటుంది. అయితే నువ్వుచేలల్లోని పైర గోంగూర పథ్యకరమైంది కాదని వైద్యులనుతము.

తెలుగుదేశంలో కర్నూలు గుంటూరుసీమలో పైరులయ్యే గోంగూర చాలా రుచిగా వుంటుంది.

గోగుఆకుతో పులుసు, పచ్చడి చేసుకుంటారు. గుంటూరు గోగు ఆకుపచ్చడి ఊరగాయవలె నిలవ కూడా వుంచుతారు.

ఉడికించిన గోగుకూర నీళ్లు తాగి చప్పిడిచేస్తే ఉబ్బురోగాలు తగ్గుతాయని చెబుతారు. గోగు ఆకు ఉడికించి కట్టితే మేహవ్రణాలు పక్వమౌతాయి; నేతితో ఉడికించి కట్టితే వరిబీజాలు తగ్గుతాయి; గోగుకూరను వేపాకుతో నూరి బోదకాళ్ళకు కట్టితే గుణకారిగావుంటుంది.

రేజీకటిరోగం కలవారికి ఈ కూర చాలా మేలుచేస్తుంది.

ఈ కూరను విస్తరించి ఉపయోగిస్తే పైత్యంచేస్తుంది; మలబద్ధం ఏర్పడుతుంది.

## ౧౦ చక్రవర్తి ఆకు

మలమూత్రాల్ని శోధించే ఆకుకూరల్లో చక్రవర్తి ఆకుకూర చెప్పతగింది.

ఈకూర బుద్ధిబలాన్ని పెంపొందిస్తుంది. ఆకలి పుట్టిస్తుంది. కళ్ళకు మేలు చేస్తుంది. మలబద్ధాన్ని పోగొడుతుంది.

వాత పిత్త శ్లేష్మాలనే మూడు దోషాల్ని పోకార్చడంలో ఇది అమోఘమైంది.

చర్మరోగాల్ని పోగొడుతుంది.

## ౧౧ చామ ఆకు

చామ దుంపలు వాడినంతగా చామ ఆకును వాడరు. దీనికి కారణం కనిపించదు.

చామ ఆకు కూర చాలా మంచిది. జబ్బుపడి లేచి నీరసస్థితిలో వున్నవారికి ఈ శాకం మేలుచేస్తుంది.

చామ ఆకులు మెత్తగా నూరి పైనవేసి కట్టుకడితే గాయాలు మానుతాయి; రక్తనాడులనుండి కారే నెత్తురు కడుతుంది.

చామ ఆకులకూర మూలశంక రోగులకు చాలా పథ్యకరమైంది. ఆ కూర మూత్రాన్ని బాగా జారీ చేస్తుంది. అరుచిని పోగొట్టి అన్నహితాన్ని కలిగిస్తుంది. ఆకలి పుట్టిస్తుంది.

చామ ఆకును పులుసుకూరగా వండి తినడం మంచిది.

## ౧౨ చింతాకు

కూరగాను, పచ్చడిగాను ఉపయోగించే చింతాకును సాధారణంగా చింతచిగురు అంటారు.

ఇది వేసవికాలంలో విశేషంగా దొరుకుతుంది. చింతచిగురు కందిపప్పు మొదలయినవానితో కలిపి ముద్దకూరగా కాని, వేయించి పచ్చడిగా కాని చేసుకుని తినవచ్చు.

చింతచిగురు కొంచెం వేడి చేస్తుందని చెబుతారు. కాని వేసవి కాలంలో దీని తినడంవల్ల ఒక మంచిగుణంవుంది. వేసవిలో చెమట విస్తారం పడుతుంది. చింత చిగురు తరుచు ఉపయోగిస్తే చెమట అంతచేటు పట్టదు.

చింతచిగురు వాతవ్యాధుల్ని, మూలరోగాల్ని, గుల్మాల్ని తగ్గిస్తుంది.

పైత్యవికారాల్ని తగ్గించే ఆకుకూరల్లో చింత చిగురు అతి శ్రేష్టమైనది.

నేత్రవ్యాధులు కలవారు దీనిని విస్తరించి తినకుండావుండడం మంచిది. చింతచిగురు కొంచెం అగ్నిమాంద్యాన్ని కలిగిస్తుంది.

ముదురు చింతాకును ఎండబెట్టి కొన్ని ప్రాంతాల్లో దానిని చింతపండుకు బదులుగా వాడతారు. ఎండబెట్టిన ముదురు చింతాకును పొడిచేసి పుల్లకూరగా వండుకునే ఆచారం ఒంగోలు ప్రాంతాల్లో వుంది.

ఈ పొడికూర చాలా పథ్యకరమైందని చెబుతారు.

చింతాకులో వాపులను హరించేగుణం వుంది. చింతాకును మెత్తగా నలగగొట్టి నేతితోనో, ఆముదంతోనో వెచ్చచేసి కాపడమిస్తే వాపులు తగ్గుతాయి.

చింతాకురసంలో పసుపు కలుపుకుని తాగితే మశూచిక వ్యాధి నివారణమౌతుందంటారు.

మొండి వ్రణాల్ని చింతాకు కషాయంతో కడిగితే అవి త్వరగా నయమౌతాయి. ఎర్రగా కాల్చిన ఇనపగరిటె చింతాకురసంలో ముంచి ఆరసం వేడిగా వుండగానే ఇస్తే అజీర్తి విరేచనాలు కడతాయి.

మోకాళ్లు మొదలయినవి వాచినప్పుడు చింతాకును నీళ్ళతో ముద్దగానూరి పట్టువేస్తే చాలాగుణకారిగా వుంటుంది.

## ౧౩ చిట్రి ఆకు

రుచికరమైన ఆకుకూరల్లో చిట్రి ఆకుకూర ఒకటి. సంస్కృతంలో దీనిని పథ్యశాక మంటారు.

ఆకారానికి ఇది ముళ్ళతోటకూరలాగ వుంటుంది. కాని ముళ్లు మాత్రం వుండవు.

విషరక్తాలను శుభ్రపరచడంలో ఇది పెట్టిందిపేరు. పెట్టు మందుల దోషాన్ని పోగొట్టడానికి చిట్రి ఆకుకూరను వండిపెడతారు. రససంబంధమైన పట్లనుకూడా ఇది పోగొడుతుంది.

ఈ ఆకుకూర మలమూత్రాల్ని బాగా వెడలిస్తుంది.

కందిపప్పులు మొదలయిన పప్పుల్లో చేర్చి ముద్దకూరగా లేదా పొడికూరగా వండుకోవచ్చు.

ఈ కూర బాగా ఆకలికలిగిస్తుంది. వాత పిత్త శ్లేష్మాలనే త్రిదోషాల్ని పోకారుస్తుంది.

కళ్ళ జబ్బులు, మెదడు జబ్బులు కలవారికి ఇది మిక్కిలి హితకరమైంది.

ఈ కూరలో ఉక్కు-లోహం వుందని చెబుతారు.

రక్త పిత్త వ్యాధుల్లో, గుండె జబ్బుల్లో చిట్టి ఆకుకూర చాలా పథ్యకారిగా వుంటుంది.

చిట్టికూరలో చిట్టి, సీటిచిట్టి, చిన్నచిట్టి అనే మూడురకాలు వుంటాయి. కొద్దిపాటి తేమగల ప్రదేశాల్లో చిట్టికూర బయలుదేరి బాగా పెరుగుతుంది.

## ౧౪ చిలుక కూరాకు

నదుల గట్టులు, చెఱువు గట్టులు మొదలయిన తేమగల ప్రదేశాల్లో ఈకూర పెరుగుతుంది.

ఇది సరస్వతి మొక్కను పోలి వుంటుంది. సరస్వతి (బ్రహ్మి) మొక్కను పోలివుండడంచేతను, జల ప్రదేశాల్లో బయలుదేరడం చేతను దీనికి జల బ్రహ్మి అనే నామం సంస్కృతంలో వుంది.

రుచికి ఇది చేదుగా వుంటుంది. ఉష్ణవీర్యమైంది. శ్లేష్మ, పైత్య దోషాల్ని ఇది పోగొడుతుంది. విరేచనకారి. కడుపులో పురుగుల్ని హరిస్తుంది. కుష్టరోగాన్ని పోకారుస్తుంది.

ఆకలిని పుట్టిస్తుంది. బుద్ధి బలాన్ని కలిగిస్తుంది. ఉత్సాహాన్ని ఇస్తుంది. పుష్టి, తుష్టి ఇచ్చే ఆకు కూరల్లో ఇది ఒకటి.

మూలవ్యాధుల్లో, గ్రహణి రోగాల్లో, ఉబ్బురోగాల్లో, కడుపులో బల్లలు పెరిగే రోగాల్లో ఈ కూర చాల పథ్యకారిగా వుంటుంది.

చిలుకకూరాకు రసంలో తెల్ల చందనపుముద్ద రంగరించి మశూచికరోగారంభంలో తాగితే ఆ రోగం తగ్గుతుంది.

చిలుకకూరాకు రసంలో సముద్ర ఫేనపు (సురపియ్య) పొడి కలిపి శరీరానికి రాచుకుంటే శరీరం యొక్క దుర్వాసన తొలగి పోతుంది.

## ౧౫ చుక్క ఆకు

చుక్క ఆకును కొన్ని ప్రాంతాల్లో పుల్లబచ్చలి అంటారు. ఈ చెట్టు బచ్చలిని పోలివుంటుంది.

చుక్క ఆకులు దళసరిగా, పెళుసుగా వుంటాయి. చుక్క ఆకులో జిగురుపదార్థం వుంది.

ఉష్ణతత్వం కలవారికి ఇది చాలా మేలు చేస్తుంది. జీర్ణకోశంలో కనిపించే మంటను, వేడిని ఇది తగ్గించివేస్తుంది. పైత్యాధిక్యం చేత కలిగే విరోచనాల్ని, రక్త గ్రహణుల్ని కట్టించివేయడంలో చుక్కకూర అమోఘమైంది.

మూలరోగాలు, గుల్మాలు, క్షయలు, మేహవ్యాధులు మున్నగు వానిలో ఇది మిక్కిలి పథ్యకరమైన కూర.

గుండె జబ్బుల్లో కూడా హితకరమై వుంటుంది. రసదోషాలు, విషదోషాలు పోగొట్టడంలో ఈ కూర ప్రశస్తమైంది.

బుద్ధికి చలవచేస్తుంది. ఉత్సాహ వికాసాలు కలిగిస్తుంది. మలమూత్రాల్ని జారీచేస్తుంది.

వాంతుల్ని కట్టడంలో కూడా ఈకూర సమర్థమైంది.

పక్వంకాకుండే వ్రణాలమీద చుక్క ఆకు వేసి కడితే గుణకారిగా వుంటుంది. చుక్క ఆకు వెచ్చచేసి రసం చెవిలోపిండితే చెవిపోటు నయమౌతుంది.

చుక్క ఆకుకూర వీర్యవృద్ధికరమైంది.

## ౧౬ తమలపాకు

తమలపాకుల్ని మనం కూరగా ఉపయోగించం. కాని పచ్చివిగా గానే ఉపయోగిస్తాము. తమలపాకులకు సున్నంరాసి వక్కతో కలిపి తాంబూలంగా సేవిస్తాము.

తినెడు ఆకులు కలదికాబట్టి దీనికి భక్ష్యపత్రి అనిపేరు. తమలపాకులు ఆయాసాన్ని తగ్గిస్తాయి. నోటికి రుచినిపుట్టించి దుర్వాసన పోగొడతాయి.

తమలపాకులు వేడిచేసే స్వభావాన్ని కలిగి కామోద్రేకాన్ని కలిగిస్తాయి.

వాత కఫాల్ని హరిస్తాయి. కంఠస్వరాన్ని బాగు చేస్తాయి.

పండు తమలపాకులు సేవిస్తే పసరు పెరగదు. అవి బాలింతరాళ్ళకుకూడా పథ్యకరమై వుంటాయి.

తమలపాకుల ఔషధోపయోగాలు సర్వత్ర తెలిసినవే కాబట్టి విస్తరించలేదు.

## ౧౭ తుమ్మి ఆకు

గంటి, నువ్వు మున్నగు సస్యాలు పైరయ్యే మెరకచేలలో తు

మ్మిచెట్లు పెరుగుతాయి.

తుమ్మి ఆకులు పులుసుకాచుకుంటారు. తుమ్మి ఆకులకు ఒక విధమైన సువాసనవున్నది.

అగ్నిమాంద్యాన్ని పోగొట్టే రుచికరమైన కూర వాతాన్ని, కఫాన్ని హరిస్తుంది.

తుమ్మి ఆకురసంలో కొంచెం ఉప్పుకలిపి శరీరానికి రాస్తే చిడుం తగ్గుతుంది.

తుమ్మి ఆకుకు సమభాగం మిరియాలుచేర్చి కుంకుడుకాయంత మాత్రలు చేసి స్త్రీలు బయట వున్న మూడురోజులు రెండు పూటలూ సేవించి పాలు, అన్నం పథ్యంగావుంటే ఎట్లాంటి ముట్టు నొప్పులయినా నశిస్తాయి. ఋతువు బాగా జారీ అవుతుంది. సంతాన కోశం బాగుపడుతుంది.

కడుపులోని పురుగుల్ని నాశనం చేయడంలో తుమ్మి ఆకు ప్రశస్తమైంది.

మూలరోగాల్లో, విషదోషాల్లో, గ్రహణి రోగాల్లో తుమ్మి ఆకుకూర పథ్యకరమై వుంటుంది.

## ౧౮ తోట కూర

తోటకూర మహాశాకం. ఋషిపంచమి మున్నగు వ్రతాల్లో ఇది దానంచేయతగ్గ శాకంగా చెప్పబడింది.

3 లేక 3½ అడుగులవరకు ఎదిగే చిన్న మొక్క. ఇందులో అనేక రకాలు వున్నాయి. పెరుగుతోటకూర, కొయ్యతోటకూర, చిలుకతోటకూర, ఎర్రతోటకూర మొదలయినవి.

ఇందులో కొయ్యతోటకూర బాగా వేడిచేస్తుంది. కాబట్టే దీనిని బాలింతలకు, నంజువ్యాధి కలవారికి బాగా వాడుతున్నారు. వాతతత్వం కలవారికి ఈకూర మేలుచేస్తుంది. ఉష్ణతత్వం కలవారికి గుండెల్లోనొప్పి, పిత్తవికారం కలుగుతుంది.

కొయ్యతోటకూర తప్ప మిగతా అన్నిరకాల తోటకూరలు సమశీతోష్ణగుణం కలిగి వుంటాయి.

అన్నిరకాల తోటకూరల్లోనూ ఇనుము వుందని శాస్త్రవేత్తలు చెబుతారు.

తోటకూరను పుల్లకూరగా, తీయకూరగా, పప్పుకూరగా, పులుసుగా వండుకుంటారు.

చిలుకతోటకూర పాటి పెరళ్ళలో బాగా ఎదుగుతుంది. కొయ్యతోట కూరను అన్నికాలాల్లోనూ పెంచవచ్చును.

తెలుగువారికి ఇది బాగా పరిచయమైన శాకం. కాబట్టి విస్తరించడం లేదు.

## ౧౯ దొగ్గలి ఆకు

ఏడాదికి ఒకసారైనా దొగ్గలి ఆకుకూరను తినాలని పెద్దలు చెబుతారు. శరీరంలోని రక్తగతాలయిన సూక్ష్మ క్రిముల్ని సయితం నశింపచేసే ఓషధీగుణం ఈకూరకు వుంది.

దొగ్గలి కూర బాగా అన్న హితవును కలిగిస్తుంది. అయితే సరియైన జీర్ణశక్తి లేనివారు ఈ కూరను ఉపయోగించకుండా వుండడం మంచిది. అట్టివారికి ఈకూర కొంచెం గురుత్వాన్ని కలిగిస్తుంది.

ఈకూర మొత్తంమీద త్రిదోషహరమైంది.

దొగ్గలి ఆకుతో కూర,పచ్చడి, పులుసు చేసుకుంటారు.

ఈ కూర కొంచెం వేడిచేస్తుంది. మలబద్ధాన్ని కలిగించే గుణంకూడా దొగ్గలి ఆకులోవుంది.

## ౨౦ దోస ఆకు

దోసకాయలేకాని దోస ఆకు కూరగా వండుకునే ఆచారం తెలుగు దేశంలో లేదు.

వంగదేశంలో దోస ఆకు కూరను అతి ఆప్యాయంగా తింటారు.

దోస ఆకుకూర నోటికి చాలా రుచిగా వుంటుంది. మలమూత్రాల్ని జారీ చేస్తుంది. పైత్యభ్రాంతిని తొలగిస్తుంది.

## ౨౧ నీరుల్లి

నీరుల్లి దుంపలోనుంచి మొలిచే ఆకులు కాడలమాదిరిగా వుంటాయి. వానిని ఉల్లికోళ్లు అంటారు.

వీనిని పులుసుకి, కూరకికూడా ఉపయోగిస్తారు.

మేహశాంతిని కలిగించే ఆకు కూరల్లో ఇవి ప్రశస్తమైనవి. నరాల దౌర్బల్యాన్ని ఈకూరతో లగిస్తుంది. ఆకలి పుట్టిస్తుంది. ముఖకాంతిని పెంచుతుంది.

ఎండిపోయిన శరీరం కలవారికి ఉల్లికోళ్ళకూర కొత్తనెత్తురు పట్టేటట్లు చేస్తుంది.

విషదోషాలు, రసదోషాలు పోగొట్టడంలో ఈ కూర శ్రేష్టమైనది.

మూత్రంవెంట రక్తంపడే వ్యాధిలో ఇది మిక్కిలి పథ్యకారిగా వుంటుంది.

## ౨౨ పుదీనా

పుదీనా చాలా సున్నితమైన ఆకుకూర. శీతాకాలంలో ఇది బాగా పైరు అవుతుంది. వర్షాకాలంలోనూ, వేసవికాలంలోను ఇది పెరగడం కష్టం.

పుదీనా ఆకులకు ఘాటైన సువాసన వుంటుంది. పుదీనా కొనలు కత్తిరించి ఉపయోగిస్తూ వుంటే అది తిరిగి రెబ్బటిల్లుతుంది.

పుదీనాను విశేషంగా పచ్చడికి ఉపయోగిస్తారు. పులుసుల్లో, కూరల్లో కూడా వేస్తారు. దీనికి సంస్కృతంలో 'శాకశోభన' అనే పేరువుంది. కూరలకు శోభకూర్చేది అని దాని అర్థం.

నోటియొక్క అరుచి పోవడానికి పుదీనా ఆకులతో ఒక విధమైన పచ్చడిచేసి భుజిస్తారు పుదీనా ఆకులు, ఖర్జూరపు కాయలు, మిరియాలు, సైంధవలవణం, ద్రాక్ష మొదలయినవి పచ్చడిచేసి అందులో నిమ్మకాయరసం పిండి ఉపయోగిస్తారు

పుదీనా ఆకులరసం తేనెతో కలిపి చెవిలోవేస్తే చెవిపోటు తగ్గుతుంది; కణతలకు వ్రాసుకుంటే తలనొప్పి నయమౌతుంది; పుళ్ళకు మొదలయినవానికి రాస్తే అవి చప్పున నయమౌతాయి.

గుండెలకు ఇదిచాలా పథ్యకరమైంది. కలరా రోగాల్లో పుదీనా మంచి గుణకారిగా వుంటుంది. ఎక్కిళ్లు, వమనాలు మొదలయిన రోగాల్లో పుదీనా వాడతగి వుంటుంది.

పుదీనా ఆకును నేతితో వేయించి కాని, పచ్చిది కాని తొక్కి పచ్చిమిరపకాయలు, ఉప్పు చేర్చి నూరి నిమ్మరసం పిండి ఉపయోగిస్తే చాలారుచికరంగా వుంటుంది.

జ్వరాలు మొదలయిన వాటితో నలుగుడుపడి లేచినవారి అరోచకానికి ఈపచ్చడి చాలా గుణకారిగా వుంటుంది.

అమృతాంజనం మొదలయిన తలనొప్పి మందుల్లో జాస్తీగా పడే మెంథాల్ పుదీనా ఆకులనుంచే తయారుచేస్తారు.

అజీర్ణరోగులకు పుదీనా నిత్యం సేవింపదగి వుంటుంది.

## ౨౩ పొన్నగంటి

'పోయిన కంటినిచ్చు పొన్నగంటి' అనే నానుడి ఒకటి ఈ శాకాన్నిగురించి ఏర్పడింవుది. దీనిని బట్టి పొన్నగంటికూర నేత్రవ్యాధుల్లో మిక్కిలి పథ్యకారిగా వుంటుందని నిర్ణయమౌతూవుంది.

నేత్రరోగాలికి, శిరోరోగాలికి ఆయుర్వేదవైద్యులు వాడే భృంగామలక తైలంలో పొన్నగంటి కూరరసం కూడా పడుతుంది.

పొన్నగంటికూర చలవచేస్తుంది. నేత్రవ్యాధుల్ని పోగొడుతుంది. జ్వరతాపాల్ని, విదాహాన్ని తగ్గిస్తుంది. సుఖకరమైన శాకాల్లో ఇది ఒకటి.

రక్తదోషాల్ని, కుష్ఠరోగాల్ని పోకారుస్తుంది.

ఆవునేతిలో ఉడికించి పొన్నగంటి ఆకును కండ్లకు కడితే వేడివల్ల కలిగే నేత్రవ్యాధులు నయమవుతాయి. వేడివల్ల వచ్చే తలపోట్లల్లో పొన్నగంటి ఆకు తలకు కట్టడం మంచిది.

పొన్నగంటి ఆకురసంకాని, ఆకునూరిన ముద్దకాని పైనవేసి కడితే గాయాలు మాన్తాయి.

పొన్నగంటి కూరలోనే వేరొక రకంవుంది. దానికి సీమపొన్నగంటి అని పేరు. సీమ పొన్నగంటిగూడా దేశవాళీ పొన్నగంటి గుణాలే కలిగివుంటుంది.

## ౨౪ బచ్చలి

ఇది సర్వసాధారణమైన పత్రశాకం. ఇందులో అనేకమైన రకాలు వున్నాయి.

మొక్కగా పెరిగే మట్టు బచ్చలి ఒకరకం. తీగలుగా ప్రాకే రకం ఒకటి. దీనిని తీగబచ్చలి అంటారు. ఎఱ్ఱబచ్చలి, పాలబచ్చలి, పెద్దబచ్చలి, పుల్లబచ్చలి అని ఇతర రకాలు.

పుల్లబచ్చలినే చుక్కకూర అంటారు. దీనినిగురించి చుక్కకూర అనే శీర్షికక్రింద వ్రాసే వున్నాను.

ఎఱ్ఱ బచ్చలినే రాచబచ్చలి అంటారు.

బచ్చలి జాతులన్నీ గూడా చలవచేసే గుణాన్ని కలిగివుంటాయి.

అన్ని బచ్చలి ఆకుల్లోకి మట్టు బచ్చలి ఆకు శ్రేష్టమైందని చెబుతారు. మట్టుబచ్చలి అన్ని కాలాల్లో పెరుగుతుంది. ఇది వాగ్దోషాల్ని పోగొడుతుంది. వ్రణాల్ని హరిస్తుంది. మూలవ్యాధుల్ని నయం చేస్తుంది.

బచ్చలి శాకాలన్నీగూడా కొంచెం గురుత్వంచేసి నిద్రను పుట్టిస్తాయి.

కందిపప్పుతో కలిపి వండితే బచ్చలి ఆకుకూరయొక్కదోషం తొలగిపోతుందని చెబుతారు.

బచ్చలి కూరలో నువ్వుపిండి చల్లుకోవడం కొన్ని ఇళ్ళల్లో ఆచారమైవుంది. కాని ఇది అంత మంచిదికాదు. ఈమాదిరి కూర తింటే అతిసారవ్యాధి వస్తుందని వైద్యులు చెబుతారు.

బచ్చలి కూరగా, పులుసుగా వండుకుంటారు. మజ్జిగ పులుసుగా కూడా వండుకుంటారు.

మజ్జిగతో కాచిన బచ్చలి పులుసు రక్తం ఎక్కువగా పడేమూలవ్యాధులలో గుణకారిగా వుంటుంది.

పెద్దబచ్చలి రసాన్ని కాలిన చోట పట్టిస్తే మంటతగ్గి పుండు త్వరగా మానుతుంది.

అన్ని రకాల బచ్చలిలోను ఇనుము లోహం విస్తరించివుంది. కాల్షియమ్, భాస్వరము కూడా కొద్దికొద్దిగా వున్నాయి.

## ౨౭ బలుసాకు

బలకరమైన ఆకుకూరల్లో బలుసాకు ఒకటి. బతికివుంటే బలుసాకు తిని బతకవచ్చునని సామెతవుంది.

బలుసాకు పితృదేవతలకు ప్రియమైంది. అందుచేతనే నిష్టాపరులు తద్దినాలలో బలుసాకుపచ్చడి తప్పకుండా చేయిస్తారు.

నీళ్ళ విరేచనాలు, గ్రహణులు, అతిసారాలు మున్నగు వ్యాధుల్లో బలుసాకు మిక్కిలి హితకరమై వుంటుంది.

పైత్యరక్తాన్ని, మేహాన్ని, అగ్నిమాంద్యాన్ని తగ్గిస్తుంది. కొంచెం గురుత్వం చేస్తుంది.

క్రిమిహరమై, పథ్యకరమై వుంటుంది.

## ౨౮ బొద్ది ఆకు

బొద్దిఆకుకూర తిన్నవాడు బుద్ధిమంతుడు అగును అనే ఆర్యోక్తి నెల్లూరు జిల్లాలో బాగా వాడుకలో వుంది.

నెల్లూరు, గుంటూరు జిల్లాలలో ఈకూరను విరివిగా వాడతారు.

బొద్ది ఆకుకూర చాల రుచిగా వుంటుంది. కాని కొంచెం గురుత్వాన్ని చేస్తుంది. ఐనా బలకరమైన కూర.

త్రిదోషాల్ని హరిస్తుంది. మూత్రవ్యాధుల్లో, పాండురోగాలలో గుణకారిగా వుంటుంది.

బొద్ది ఆకుకూరను తినడంవల్ల రసదోషాలు, విషదోషాలు తొలగిపోతాయి.

## ౨౯ మునగాకు

'ముట్టునీళ్ళనాడు మునగాకు కూర' అని సామెత.

దీనినిబట్టి స్త్రీలు ముట్టునీళ్ళనాడు మునగాకుకూరతినడం పథ్యకరమైవుంటుందని ఏర్పడుతూవుంది.

మునగాకును పప్పులో వేసి ముద్దకూరగా కాని, పొడికూరగా కాని వండుకోవచ్చును.

ముట్టునీళ్ళనాడు స్త్రీలకు వాతం ప్రకోపమై వుంటుంది. ఆ వాతదోషం పోవడానికి మునగాకుకూర బాగా పనిచేస్తుంది.

శరీరంలోవుండే చెడ్డనీరును తొలగించివేయడానికి మునగాకుకూర పెట్టింది పేరు.

ఉష్ణతత్వంగలవారు ఈకూరను బొత్తిగా ఉపయోగించకుండా వుండడం మంచిది.

మునగకుగల సంస్కృతనామాలలో శాకపత్ర అనేది ఒకటి. కూ

రకు ఉపయోగపడే ఆకులు కలది అని అపదానికి అర్థం.

ఈ కూర దృష్టిమాంద్యాన్ని పోగొడుతుందని చెబుతారు

ఏడాదికి ఒకసారి ఐనా ముఖ్యంగా ఆషాఢమాసంలో మునగాకు కూర తినాలి అని పెద్దలు చెబుతారు. తెలికపిండిలో మునగాకు కలిపి కూరవండుతారు.

## ౨౮ మెంతి ఆకు

నల్ల నేలలో శీతాకాలంలో పైరుచేయబడే మెంతికూర చాలారుచిగా వుంటుంది.

మెంతికూర పచ్చిగా వున్నపుడుకాని, ఎండపెట్టి వరుగుచేసికాని వుపయోగింపవచ్చు.

మెంతి ఆకు పచ్చిది తింటే కొంచెం చిరుచేదుగా వుంటుంది. వండిన తరవాత మంచి రుచిగా వుంటుంది.

మెంతికూర స్త్రీలకు చాలా హితకరమైంది. స్త్రీల గర్భాశయాన్ని బాగుపరచడంలో, ఋతుస్రావాన్ని సుష్టుచేయడంలో మెంతికూర బాగా పనిచేస్తుంది.

ఏ విధమైన మూత్రరోగాల్లో కాని ఇది చాలా గుణకారిగా వుంటుంది.

మెంతికూరలో మేహశాంతి నిచ్చే మంచిగుణంవుందికాని త్వరగా జీర్ణంకాదు.

మెంతికూరతో కూర, పులుసు, పచ్చడి కూడా తయారుచేస్తారు. ఎండిన మెంతికూరను చారులో వేస్తారు. అందువల్ల చారుకు ఒక విధమైన సువాసన వస్తుంది.

మెంతి ఆకులు వెన్నలో ఉడికించి వేయించి ఇస్తే శైత్యవికారం తగ్గుతుంది. ఈ ఆకులు నూరిన ముద్ద కాలినపుండ్లకు, వాపులకు పట్టువేస్తే చల్లగావుండి మేలు చేస్తుంది.

## ౨౯ వేపాకు

ఉగాది పచ్చడిలో వేపపువ్వును ఉపయోగించడం తప్ప వేపాకు మనం తినుబండారాలలో వాడం.

వంగదేశస్థులు మనం కరివేపాకు ఉపయోగించే సందర్భాలన్నిటిలోనూ వేపాకును వాడతారు. లేత వేప చిగుళ్ళవాడకం మనం కూడా చేకోనడం మంచిదని తోస్తుంది.

అమ్మవారి జబ్బులలో వేపరొట్టతో విసరడం మొదలయిన అలవాట్లు మనకున్న వే. పూర్వం మనవాళ్లు ఇళ్ళలో కర్రలతో, మట్టితో అటుకులు కట్టుకునేటప్పుడు కర్రలమీద వేపాకువేసి దానిమీద మట్టిముద్దలు వేసేవారు.

ఇట్లా చేయడంవల్ల చెదపురుగులబాధ ఆ అటుకులకు వుండేది కాదు.

వేపాకు ప్రాశస్త్యం ఇట్టిది. కాబట్టి మనం దానివాడకాన్ని నేర్చుకోవడం అవసరం.

వేపాకును మెత్తగానూరి అందులో తేనె కలిపి రంగరించి వ్రణాలమీద పూస్తే అవి త్వరగా మాను పట్టుతాయి.

వేపచిగుళ్ళకూర రక్తపైత్యాన్ని శమింపచేస్తుందని వైద్యగ్రంథాల్లో కలదు.

వేప చిగుళ్ళలో రాగి పాలు హెచ్చుగావుంది.

## ౩౦ సరస్వతి ఆకు

సరస్వతి ఆకు కూర చాల చేదుగా వుంటుంది. ఐనా ఓషధీ గుణాన్నిపట్టి ఇది సేవింపతగివుంది. రెండు సారులు వార్చడంచేత ఈ కూరయొక్క చేదు కొంత తగ్గుతుంది.

ఈకూరను తినడంవల్ల మేహరోగాలు, కుష్టరోగాలు, చర్మరోగాలు పోతాయి. ఆకలి కలుగుతుంది. ముఖానికి తేజస్సువస్తుంది. బుద్ధి బలం పెంపొందుతుంది.

స్త్రీలకు, పురుషులకుకూడ సమానంగా ఉపకారకమైనశాకం.

## ౩౧ సీకాయ ఆకు

సీకాయ తీగజాతిలోని చెట్టు.

సీకాయ ఆకు, చిగురు కూడ కొంచెపుంత పుల్లగా వుంటాయి.

ఆకు, చిగురుకూడ పచ్చళ్ళకు ఉపయోగిస్తారు. ఈ పచ్చడి విరేచనాన్ని చేస్తుంది. శ్లేష్మాన్ని హరిస్తుంది. పాండురోగాల్ని, పిత్తవ్యాధుల్ని తగ్గిస్తుంది.

జ్వరరోగులు పథ్యం పుచ్చుకునే సందర్భంలో సీకాయచిగురు పచ్చడిని పలువురు ఆయుర్వేదవైద్యులు సిఫారసు చేస్తారు.

ఈ ఆకుల కషాయం మలేరియాజ్వరంలో మిక్కిలి గుణకారిగా వుంటుంది.

* అచ్చుతీరి అమ్మకమునకు సిద్ధముగా నున్న శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారి గ్రంథములు

## ఆంధ్రరమణీమణులు భా-౧

ఇందు—కాకతీయాంధ్రసామ్రాజ్య సింహాసన మధిరోహించి జనరంజకముగ, శత్రుభయంకరముగ రాజ్యమేలిన రుద్రమ్మ; ధరణికోట సింగపుపీఠి నెక్కి అసామాన్యముగ రాజ్యచక్రము ద్రిప్పిన గణపమ్మ; ఆంధ్రదేశమున ఆడుదియై పుట్టిన మంత్రిరాక్షసుని అపరావతారముగా నాయకురాలను బిరుదుగాంచిన పలనాటి నాగమ్మ. కౌగిలిలోన్న భర్తను దీవించి కరవాలమొసగి కదనరంగమునకంపిన మాంచాల; ప్రజారంజకముగ పెద్దాపుర సంస్థానమును పాలించి తురకఫౌజుదారుని బారి పడకుండ జోహారొనర్చిన అభిమానస్వరూప రాగమ్మ; ఆమె చేతుల నుండి ఆమె మనుమని ఏడుమాసముల కసుగందుని గ్రహించి పంచకరపాట్లుపడి అరసి రక్షించిన స్వామిభక్తిపరాయణ మహాలక్ష్మమ్మ; పతియగు రాయజగపతితో సహగమన మొనర్చుచు పతి విరోధియగు ఆనందరాజునకు తిరుగని శాపమిచ్చిన మహాపతివ్రతాతిలకమగు సీతమ్మ; రాణివాసపు స్త్రీలందఱకంటె ముందుగాఁ దాను కత్తికెరయై మానమెఱిఁగిన స్త్రీత్వమునకు మొదలిపేరైన బొబ్బిలిరాణి మల్లమ్మ; నిండు చూలాలయ్యు మానసంరక్షణార్థమై నిజప్రాణముల ఖడ్గమున కెరచేసిన రమణమ్మ—వీరల అద్భుతచరితలు ఆంధ్రాభిమానముతో ప్రస్తరింపబడినవి. దళసరి కాగితములు.

రెండవ కూర్పు. 112 పుటలు. దళసరి కాగితములు.
పోష్టుఖర్చులు ప్రత్యేకము. ప్రతి 1-కి అణాలు 8

## ఆంధ్రరమణీమణులు భా-౨

ఇందు—రణరంగమున వీరవిహారము విరమించి యింటికి వచ్చిన పతికి వీరసందేశమిచ్చి తిరిగి కదనభూమికి పంపి అతనికి వీరస్వర్గమిప్పించిన ఆంధ్రవీరపత్ని చానమ్మ- మానముకొఱకు, మాటవాసికొఱకు తన్నుతాను పొడుచుకొని చనిపోయిన తంజావూరి తెనుగురాణి రాజగోపాలమ్మ- ఈ రాజగోపాలమ్మ మనుమని చెంగమలదాసుని విక్రాంతి సమయమున అరసి రక్షించి తన ప్రభుభక్తిని ప్రకటించిన దాది- మధుర ఆంధ్రనాయక రాజ్యపాలనమును మహనీయముగ సాగించి దాననిరతిని, ఆంధ్రభాషాభిమానమును అతిశయముగ ప్రదర్శించిన మంగమ్మ- చాందాసాహేబు మోసమునకు గుఱియైన మీనాక్షి- పథ్యముముట్టని పచ్చి బాలెంతరాలయ్యు తన సహగమనోద్యోగము నెఱవేఱక పోగా పన్నీరుత్రాగి ప్రాణములు విడిచిన పతిప్రాణ ముత్తమ్మ ప్రజోపయోగమునకై శిశు సహితముగ బలిపోయిన సంగమ్మ వీరల పవిత్రచరిత్రలుగలవు.

దళసరి కాగితములు. 100 పుటలు. ప్రతి 1-కి అ. 8.
పోష్టుఖర్చులు ప్రత్యేకము.

## కేయూరబాహుచరిత్ర

శిల్పము మెఱయ మంచనమహాకవి రచియించిన కేయూరబాహుచరిత్ర అను పద్యకావ్యమును ఆధారముగ తీసికొని తేట తెనుగు వచనమున జనసామాన్యముకొఱకు వ్రాయబడినది. పెండ్లాడిన వానిని సార్వభౌమునిగా జేయు వరమునొందిన మృగాంకావళియను నొకరాజకన్యను కేయూరబాహువను రాజునకు నతని ధర్మపత్నిచే భాగురాయణుడను నాతనిమంత్రి నిజబుద్ధిబలమున వివాహము చేయించిన వృత్తాంత మిందలి ప్రధానకథ. నడుమ నడుమ చక్కని నీతికథలు పెక్కులు గలవు.

గ్లేజు కాగితములు. 90 పుటలు. ప్రతి 1-కి అ 8.
పోష్టుఖర్చులు ప్రత్యేకము.

☞ ఈ మూడుగ్రంథములు ఒకేసారి తెప్పించుకొనుచో రూ 1-0-0 మాత్రమే. పోష్టుఖర్చులు ప్రత్యేకము.

ఆంధ్రభూమి బుక్కుడిపో, వేపేరి, మదరాసు.

## ఆంధ్ర రాజభక్తులు

రాజభక్తి యనునది దేశభక్తికి పర్యాయపదముగా రాణించుచుండిన ఆంధ్రదేశపు స్వతంత్రయుగ చరిత్రలలో రాణించు రాజభక్తి శిఖామణులగు విశ్వనాథనాయుడు, యాచమనాయుడు, అబ్దుర్ రజాక్ లారీ, కరిబసవస్వామి, తిక్కనమంత్రి, మహాలక్ష్మమ్మ, పాపారాయుడు, హనుమప్పనాయుడు అను ఎనమండుగురి చరిత్రలను కీర్తించు గ్రంథము.

## ఆంధ్ర వీరయువకులు

ఇరువదియైదేండ్లకు లోబడినవారయ్యు అత్యద్భుతవీరకృత్యము లొనరించి ఆంధ్రకీర్తిని అతిశయముగ వెలయించిన బాలచంద్రుడు, హాలురాజు, మన్నారుదేవుడు, చినకేశవప్పనాయుడు, రంగకృష్ణముద్దువీరప్పనాయుడు మున్నగు వారల వీరజీవితములను వివరించు గ్రంథము.

## ఆంధ్ర విదుషీమణులు భా-౧

సంస్కృతభాషయందు అపారమైన పాండిత్యమును సంపాదించిన విష్ణుశక్తి కూతురు, నాచి, గంగాదేవి, తిరుమలాంబిక, రామభద్రాంబ, మధురవాణి, తుక్కాదేవి మున్నగు తెనుగు తెఱవల చరిత్రలును; నాట్యకళయందు విశేషకౌశల్య మార్జించి రాజమన్నన లందిన లకుమాదేవిచరిత్రయు నిందు ప్రస్తరింపబడినవి.

## ఆంధ్ర విదుషీమణులు భా-౨

తెనుగులో గ్రంథరచనముగావించిన మొల్ల, మోహనాంగి, ముద్దుపళని, సుభద్రమ్మ, వెంకమ్మ, బాపనమ్మ, రత్నాంబ, రంగాజమ్మ, కృష్ణాజమ్మ, చంద్రరేఖ, పాపమ్మ అను పదునొకడుగురు విదుషీమణులచరిత్రము లిందు విపులీకరింపబడినవి.

## మదరాసు మనది

మదరాసు మహానగరము ఆంధ్రులదని నిరూపించు ప్రచారక గ్రంథము. మదరాసు స్థలదానకర్తలము మనము, చెన్నపురికి నామకరణముచేసినది మనము, మదరాసునామ మిచ్చినదియు మనమే, ఆదిలో జార్జిటవున్ తెలుగుటవున్, చింతాద్రిపేట మనవారి శ్రోత్రియము, నుంగంబాకము మన జమీందారీగ్రామము, రాయపేట మనరాయలపేరపుట్టినది, రాయపురమునకు ఆపేరిచ్చినది మనవారే; పెద్దనాయనిపేట తెనుగునాయనిపేరపుట్టినది ; మదరాసు మనదిచేసిన మాన్యులు మున్నగు ప్రకరణములు గలవు.

## వణిక్పుంగవులు
## మొదటి మొగ్గలు
## మన ఫలవృక్షములు
## మన పెరటి చెట్లు
## మన పండుగలు
## సారస్వతవ్యాసములు
## హాస్యవ్యాసములు
## రైవతుని రచనలు

ఆంధ్రభూమి బుక్కుడిపో, వేపేరి, మదరాసు.

# కాటేరి ఓటమి

[౧౪౪-వ పేజీ తరువాయి.]

సూరయ్యను వేడుకొంది దీనంగా.

కొంచెం నిలిపాడాతడు.

పోలేరమ్మ ఆతడితో "కోప పడక నేను చెప్పేదివిను. నీకు మంచిమాటనే చెప్తాను. ఏమంటే నీకు యేటేట యీనాటికి మంచివిగా రాయి మట్టి పొల్లులేని పుట్లెడు వడ్లు తెచ్చి నుక్తాగా యిస్తుంటాను. ప్రమాణంగా చెపుతున్నాను. తప్పను. ఈసేద్యంచేసే కష్టాలు యేవిన్ని నీవు పడవలసిందిలేదు. ఈ చోటు దున్నడం మానుకో—నీకు పుణ్యం ఉంటుంది. నన్ను కొంపగాని దాన్నిగా చేయవద్దు" అని యిక లేదన్నట్లు బతిమాలుకొంది అతణ్ణామె—

ఆలోచించాడు సూరయ్య. పోలేరు చెప్పింది బాగానేవుందని – తనకష్టం తప్పిపోతుందని అనుకొన్నాడు. ఆమెనుచూచి "నీవు బతిమాలుతున్నావు కాబట్టి దున్నడం చాలిస్తా. అయితే యీయేటి మక్తా ధాన్యం ముందుగానే, యివ్వాళనే కొలవాలె– అలాచేస్తానంటే యింటికి పోతాను. చెప్పినమాట ప్రకారం యివ్వకుంటే మళ్ళీ రేపు నాగేలు కట్టుకొనివచ్చేది నిజం. అపుడెన్నిచెప్పినా వినేవాణ్ణిగాను. బాగా ఆలోచించుకో" అని బెదురు పుట్టేలాగ చెప్పాడు.

ఆమె "సరి ! ఇంటికిపో ! నీవు పోవడానికి ముందుగానే వడ్లమూటలు నీయింట్లో చేరివుంటాయి. నీ యిష్టంలాగే జరుపుతుంటాను. సందేహించవద్దు" అని యామె చెప్పింది.

సూరయ్య దున్నడం చాలించి యింటికిపోయి చూడగా పుట్లెడు మంచివడ్లు మూటలుగట్టి వాకిటి యరుగుమీద వేసివుండడం కనుపడింది.

అవి యెట్లావచ్చింది తెలియక సీతమ్మ శంకిస్తూవుండి మొగుడు రాగానే అడిగింది వడ్లుయెక్కడివని.

అతడు నవ్వుతూ జరిగిందంతా చెప్పేశాడు.

ఆశ్చర్యంపొంది ఆమె "ఇది దేవుడికటాక్షం. పస్తులేకుండాగంజి తాగుతాము" అన్నది.

ఇపుడు వాళ్లకు పస్తుగిస్తులేదు.

ఇట్లా జరిగిన తరువాత వారం దినాలు గడిచినంతట ఒకనాడున్నట్టుండి వానకురియడాని కారంభించింది. రెండుమూడునాళ్లు విడవకుండా కురుస్తూవుండింది. అన్నీ తడిసిపోవడంచేత వంటచేయడానికి కట్టె పుల్లలు లేకపోయాయి.

సీతమ్మ మొగుణ్ణి పిలిచి యెక్కణ్ణయినా నాలుగు యెండుపుల్లలు సంపాదించి తెస్తేనేగాని వంట జరుగదని చెప్పింది. ఎక్కడచూచినా వానకు తడిసిపోయి వున్నాయి. ఎండినకట్టెలు దొరకడం కష్టంగా తోచింది.

అయినా చూద్దామని సూరయ్య పొరుగుయింటివారి నడిగి గొడ్డలి తీసుకొని భుజంమీద పెట్టుకొని బయద్దేరాడు యెండినకట్టెలు తేవడానికి– ఎక్కడచూచినా దొరకలేదు. ఊరివెలపట ఊళ్ళోవాళ్ళప్పుడప్పుడు తీరికవేళల్లో వచ్చి కూర్చొని మాట్లాడుకొనడానికని కట్టియుండే చావడిదగ్గరకు పోయాడు. ఆచావడి అరుగుమీద నడమున మూరెడేసి పొడుగుగలిగి మొనతేలేలాగా చెక్కినాటినవి మూడు కొయ్యలున్నవి. ఆకొయ్య పోతరాజుపేరుతో నాటి పూరివాళ్ళు పసుపుపూసి, కుంకుమబొట్లు పెట్టి అర్చిస్తూవుండేవారు. అంచేత ఆచోటు పోతురాజుచావడి అని చెప్పడం వాడుక.

చూచాడు సూరయ్య. అక్కడ యెవళ్ళులేని సమయం. తనలో అనుకొన్నాడు దేవుడా? గీవుడా? ఉంటే నాకు యిబ్బంది గలిగిస్తాడా! ఉంటే ఉండనీ చూద్దాం యేమిచేస్తాడో. ఈమూడుకొయ్యలు చీలేసి యెత్తుకొనిపోతే ఈవేళకు వంటసాగుతుంది. బాగా ఎండి ఉన్నాయి. రేపటిగతి రేపు చూచుకోవచ్చు అని.

సూరయ్య బొమ్మలదాపుకు పోయి, ముందువెనకా ఆలోచించ

కుండా గొడ్డలెత్తాడు పగతీయడానికని.

అతడిధైర్యం, సాహసం, ఉద్రేకం చూచాడు పోతరాజు. "ఓరయ్యో! వీడు యముడుగా ఉన్నాడే. నేనంటే అందరు జడుస్తారు వీడికి దేవుడనే భయం, సందేహం కూడా లేనట్లుంది. వీడు నారూపపు కొయ్యలు పడకొట్టడం నిశ్చయం. అవతల నాకీఘ్రాల్లో పేరు, ప్రతిష్ఠా వుండవు. నన్ను తలచేవాళ్ళే ఉండరు, ఉపద్రవం వచ్చిందే యేమిచేసేది. ఈపాపపు ముండాకొడుకు యెక్కడ దాపురించాడ్రా! నాప్రాణానికి" అని జడుపుతో గడగడలాడిపోయాడు పాపము పోతరాజు. "ఇంకొకక్షణం తామసిస్తే తలపగలడం సిద్ధం" అనుకొన్నాడు.

"అయ్యో! చస్తాను, చస్తాను. వెయ్యవద్దు గొడ్డలి వెయ్యవద్దు తొందరపడవద్దు" అని అరుస్తూ మనిషిరూపంతో ముందునిల్చాడు కొయ్యబొమ్మల నడుమ.

సూరయ్య కాశ్చర్యం కలిగింది. అయితేనేం? అతడు జడిసేవాడా? "చీ! ఎవడ్రా నీవు? అడ్డంవచ్చావు నేను తొరగా కట్టెలు యెత్తుకొని పోకుంటే వంటసాగదు. పోపో! అడ్డంగా నిలవవద్దు" అంటూ మళ్ళీ గొడ్డలెత్తాడు- పోతురాజు వడకుతూ చేతులడ్డంపెట్టి "ఉండు వుండు చెప్తాను. కట్టెలకా వచ్చావు? వాటిగ్గానా నువ్వు యిట్లా చెయ్యదలంచావు. వద్దు—ఆ కొరవ నేను తీరుస్తాను. నీవు యింటికి పో! పోవడానికి ముందే, మాంచి కట్టెలు—బాగా యెండివుండేవి— ఒకమోపు— నీయింట్లోచేరి ఉంటాయి— ఈకష్టం నీకు యెందుకు?" అన్నాడు.

ఆలోచించాడు సూరయ్య. "సమయందొరికింది. ఇపుడే తగినలాగా యేర్పాటుచేసుకోవాలె" ననుకొన్నాడు.

"నీవెవడవు? నీపేరేమి?" అని అడిగాడు. పోతరాజు తనపేరు చెప్పాడు.

పోతరాజు తనపేరు చెప్పాడు.

సూరయ్య తలఊస్తూ—ఓహో! నీవా? పోతన్నవా? సరేగాని యీ యేర్పాటు యీదినంతో సరిపోయ్యేదికాదు. దినదినం ఒక కట్టెల మోపు యిస్తుండాలె. ఏనాడు యివ్వకుంటె ఆనాడు గొడ్డలియెత్తుకొనివచ్చి చీలేసేది నిజం- ఆలోచించుకో, నీయిష్టం అన్నాడు సూరయ్య. అలాగేనని ఒప్పుకున్నాడు పోతరాజు. కాదంటే తనకుచావు తప్పదని అట్లావప్పుకొన్నాడు పోతరాజు.

సూరయ్య యింటికిపోయి చూడగా యెండు కట్టెలమోపు వాకిట పంచలో పెట్టబడిఉండింది. సంతోషంతో లోపలికిపోయి తన మహిమ, గట్టితనం భార్యతో చెప్పి, ఆమె ఉప్పొంగిపోయేలాగు చేశాడు. "దేవుడికి దయగలిగితే యెంతటిపనియైనా నెరవేరుతుంది" అన్నదామె.

కొన్నాళ్ళు యిట్లాజరిగింది. ఒకనాడు కాటేరి అనేశక్తి అక్కఐన పోలేరమ్మని చూడ్డానికని ఆమె యింటికి వచ్చింది. ఆమరునాడే సూరయ్యకు ముక్తావడ్లు యివ్వాలిసివుంది కనుక పోలేరు వడ్లు రాయి రప్పు యిసక పొట్టు లేకుండా చక్క బెట్టుకుంటూవుంది అపుడు.

కాటేరివచ్చినపుడు వాళ్ళతమ్ముడు పోతరాజక్కణ్ణే కూచొనివుండినాడు- కట్టెలమోపు ముందుబెట్టుకొని- అక్క వడ్లెత్తుకొని పొయ్యేప్పుడుకూడా పోయి సూరయ్య యింట్లో పడేసిరావచ్చునని. అక్కడి లక్షణాలన్నీ, వాళ్ళ నిద్దర్నీ చూచింది కాటేరి. ఆమెకు సంగతి యేమిన్ని తెలియలేదు. ఆశ్చర్యంతో చూస్తూ నిల్చుంది అట్టే దిగాలుపడి.

వడ్లు చెరుగుతూవున్న పోలేరమ్మ తలయెత్తి అటుచూచి "రా! యెడంగా కూచో. దుమ్ము పడుతుంది మీాద" అన్నది- అలుపుతో, నిట్టూర్పుతో.

"ఈ గందరగోళమంతా యేమిటిది? వడ్లెందుకు? తమ్ముడు కట్టెలమోపు పెట్టుకొని కూర్చున్నాడెందుకు. ఇదంతా చూస్తే నాకేమో ఆశ్చర్యంగావుంది ఏం కారణం" అని కాటేరి అక్కను అడిగింది కూచోకుండా నిలుచునేవుండి.

పోతరాజు గుటకలుమింగుతూ యేమిన్నీ చెప్పలేక వూరికే వున్నాడు, అక్కచాయ చూస్తూను.

పోలేరమ్మ చెప్పేసింది జరిగిన సమాచారమంతాను పూసగుచ్చిన లాగ. విన్నది కాటేరు. వెలవెల పొయ్యింది ఆశ్చర్యంతో. ముక్కుమీద వేలుబెట్టుకొని—ఇదా కథ అంటూను.

"ఈరాత్రే వద్దుంయివ్వాలె తమ్ముడు రోజూ కట్టెలుమోపు యిచ్చిరావాలె. తప్పితే నాచోటును దున్నిపాడుచేస్తాడు. తమ్ముణ్ణి చీలేసి చంపుతాడా చెడ్డ ముండాకొడుకు. నిండా దుర్మార్గుడు. వానిచేతుల్లో చిక్కొని యిట్లా మేమిద్దరం అవస్తపడుతున్నాం చూడు" అన్నది పోలేరమ్మ దీనంగా.

అప్పుడు కాటేరి కెంతో కోపం వచ్చింది. పండ్లుకొరుకుతూ అక్కని, తమ్ముణ్ణి వురిమిచూచి "చీ! చీ! బుద్ధిలేని పెంటమొగాల్లారా! మీకు పిచ్చెత్తిందా యేమి? ఎవుడో సూరయ్యంట — దున్నుతాడంట —చీలేస్తాడంట—మక్తా కొలవాలంట—కట్టె లివ్వాలంట—వింతగా వుంది మీనడత, పనులున్ను. మనం దేవతలం. అందులోనూ శక్తిగణాల్లో చేరినవాళ్ళం. వాడో? మానవుడు. వాడికా? మనం జడియడం, యివంతా యివ్వడం. అందఱు మనల్నిచూచినా, తలంచుకొన్నా గడగడలాడిపోతుంటారు. మనం యిట్లాచేస్తే యింక పరువు ప్రతిష్టా దక్కుతుందా మనకు? మనమొగమైన చూచేవాళ్ళుంటారా? లోకంలో. ఇంతమట్టుకు చేసింది చాలు. కాని యింక ఊరకున్నండి- నేను యీసందెవేళటప్పుడే పోయి, ఆపాపాత్ముణ్ణి—ఆదుష్టుణ్ణి—మెడ నులిమి చంపి — రక్తం పీల్చుకొనివస్తాను. ఇంతటితో తీరిపోతుంది మీ అవస్త" అని రౌద్రంగా చెప్పింది కాటేరు పెద్ద గొంతుతో.

పోలేరమ్మవిని "వద్దువద్దు. వాడు అల్పస్వల్పమైనవాడు గాడు. బలే చెడ్డవాడు. ఎంతపనైనా చేసే శక్తి, తెగువ, ధైర్యం గలిగినవాడు, దుష్టుడు. మంచితనంగా యెట్లానో వానిని మేము సమాధానపరచి యీపద్ధతికి యేర్పాటుచేసి కొన్నాము. లేకుంటే యింతకుముందే యెప్పుడో మేము వానిచేతుల్లో పడి పేరులేకుండా పోయేవాళ్ళమే. నీ పుణ్యాం ఊరికెవ్వుండు. వాణ్ణికదిపితే ఉపద్రవం తేనడంతప్ప మరేమి లాభంవుండదు" అని భయపడుతూ చెప్పింది పోలేరమ్మ.

పోతరాజూ అలాగే చెప్పాడు.

ఎంతచెప్పినా వారిమాటలు వినలేదు కాటేరు.

"మీకు భయమైతే నోళ్ళుమూసుకొని పడుండండి. నేనువాణ్ణి విడుస్తాననేమాట వట్టిది. ఎట్లాన్నా చంపితీరుతాను. ఇంకా రెండుగడియల్లో చంపివచ్చి మీకా సమాచారం చెప్తాను. చూడండి, నాప్రజ్ఞ" అంటూ ఉగ్రంగా బయలుదేరింది- యెంతచెప్పినా అక్కమాట, తమ్ముడిమాట వినకుండా, సూరయ్యయింటికి, కాటేరు.

అస్తమానం అయింది. కాటేరమ్మ పొయ్యేసరికి సూరయ్య యింట్లోలేడు. అతడికుండే యెనుము కట్టుమెట్టకురాక తప్పించుకొనిపారిపోయినందుచేత దాన్ని వెతుకుతూ తోల్కొని రావడానికని పోయి వుండినాడు. "సరే! రానీ! రాంగానే మెడనులిమి చంపేస్తాను. విడుస్తానా? కాటేరి పోలేరమ్మ వంటి మతిలేందికాదు" అనుకోంటూ తలుపుమూల దాగుకొన్నది. వస్తే చంపాలని కాటేరిదేవత.

మఱికొంచెంసేపటికి వచ్చాడు సూరయ్య బర్రెముందుగా పరుగెత్తి వస్తూంటే తాను దానివెనకాలనే. వెదికివెదికి, కనపడ్డంతోటే దాన్నొకదెబ్బ కొట్టాడు చేతికొద్దీ కట్టెతో అతను యెనుమును కోపంతో. అంచేత అది జడుపుతో పరుగెత్తుకొనివచ్చి తటాలున యింట్లోదూరింది.

సూరయ్య లోపల్కిపోకుండా వాకెట్లోనే నుంచుని, బిగ్గరగా అరచి చెప్పాడు భార్యనిపిలిచి "ఒసే! కాటేరి యింట్లోకివచ్చింది దాన్ని పోనీకుండా పట్టుకొనివస్తా" అని.

ఆబర్రెకు కాటేరనే పేరుపెట్టి కదూ వారు పిలుస్తుంటారు! అం

చేత యెనుమును కట్టెయ్యనడానికి బదులుగా కావేరిని కట్టెయ్యాని చెప్పినా డాతడు.

తలుపుమూలవుండే కావేరి ఆ మాంట తన్నుగూర్చి చెప్పినాడనే అనుకున్నది. బత్తెకు తనపేరు వుండడం కావేరికి తెలియదు.

సూరయ్య చెప్పినమాటకు బదులుగా అతడిభార్య లోపలనుండి "ఇదో వస్తున్నా. ఇంక యెక్కడకు పోతుంది. చిక్కింది? వచ్చి కట్టేస్తా. మీరు శీఘ్రంగా రండి" అన్నది.

ఇదంతా వినంగానే కావేరికి భయంపుట్టింది. వళ్లు గడగడావడకడాని కారంభమైంది "అయ్యో! వీళ్ళచేతుల్లో చిక్కోని చావ్వలసి వచ్చిందే. ఎట్లా తప్పించుకోవడం? వీడిదుంపతెగా — వీడు నాశమైపోను—ఇంట్లోకి రాకుండానే — వాకిట్లోవుండే యెట్లానోగాని తెలుసుకున్నాడు నేనువచ్చి వుండడం పోకిరిముండాకొడుకు. భార్యకూడా వీడికి తగిందిగానేవుంది. కట్టేస్తానంటుంది. ఈయిద్దరుచేరి యేంచేస్తారో తెలియలేదు. పెద్దచిక్కులో తగులుకొన్నాను. పారిపోవడానికైనా వీల్లేదు. వాడు వాకిట. వాడిపెండ్లాం యింట్లో- వీళ్ళని తప్పించుకొని పోవడం యెట్లా? పోనిస్తారా? యింతబిట్టుతో వుండే వాళ్ళు- ఏమిచేసేది. ఈదుర్మార్గుడి సంగతంతా యెఱిగివుండబట్టే నా అక్కా, తమ్ముడూ ఇకలేదన్నట్లు పోవద్దని చెప్పారు- లేకుంటే వాళ్ళు సామాన్యంగా లోబడేవాళ్లా వీడికి? వారిమాటలు విన్నానా? ఆలోచించానా? ఆమాటలు చెవులబెట్టక నిరాకరించాను. గర్వంతోను, కోపంతోను వాళ్ళని అనరాని మాటలని ఇదిగో! చూడండి నాప్రజ్ఞ అంటూ వచ్చాను. ఈగతి పట్టింది వీడు చెప్పేదివింటే నన్ను విడవడని తోస్తూవుంది. చంపేస్తాడు— నిజం- ఊరికేవుంటే ప్రాణం మీదికి వచ్చాక యేంచేయడం? ముందుగా నేనే పోయి యెదటబడడం మంచిదని తోస్తూవుంది- ఎదటబడి యేదైనా వుపాయముతో—సమయానికి తగినలాగ మంచిమాటలు చెప్పి తప్పించుకొనడం మంచిది- ఇంతకంటే వేరేదారిలేదు." అని ఆలోచించిందా కావేరమ్మ.

చెమటకారుతూవుండే దేహంతో—కాళ్ళుచేతులు వదురుచుండగా- జడుపువల్ల మొగం వెల్లబారగా, బిక్కిరిచూపులుచూస్తూ మెల్లగా తలుపుచాటునుండిన కావేరి బత్తెకోఅకు వాకిట కాచుకొని యముడిలాగ నిల్చుకొని వుండే సూరయ్యకెదురుగావచ్చి ముందు నిలిచింది వడకుతూను.

ఆరూపాన్ని, లక్షణాలని చూచాడు సూరయ్య. మనసులో ఆశ్చర్యం- సందేహం- కొంచెంభయం కూడాను. అయినా ధైర్యంగల వాడగుటబట్టి అవంతా బయటికి తెలియకుండా గద్దించి అడిగాడు "ఎవరవునీవు?" అని ఉరిమిచూస్తూ.

ఆచూపులతోనే సగంపోయాయి కావేరమ్మప్రాణాలు. ఎట్లానో ధైర్యం తెచ్చుకొని మనస్సు సమాళించుకొని "అయ్యా! నేను పోలేరమ్మ—మీకుమక్కాయిస్తూండే పోలేరమ్మవుందే ఆమెకు చెల్లెల్ని. కట్టెలు మీకు తెచ్చే పోతరాజుకి అక్కను. నాపేరు కావేరు" అని చెప్పింది చావుబతుకులలోవుండే మనిషిరీతిగా హీనస్వరంతో.

విన్నాడామాటలు సూరయ్య, ఏదో అదృష్టంకలిగిందని అనుకొన్నాడు తనలో. "ఓ!పోలేరమ్మచెల్లెలవా నీవు? సరి! అదివుండే మీ అక్క ఆపోరు దానికి తగిన శిక్ష చేయడాని కాలోచిస్తున్నాను. అది నిన్ననే మక్కాయివ్వాలె. ఇంతవరకు తేలేదు. అని ఉగ్రంగా చెప్పాడు.

తేవడానికే వడ్లు చక్కబెడుతూవున్నది. చూచివచ్చాను. తెస్తుంది" అన్నది కావేరు "తేకుంటే తెచ్చుకునేదారి నాకుతెలుసు. ఉండనీ— మఱి— నీవెందుకొచ్చావు? ఇక్కడ నీకేంపని వుంది?" అని అడిగాడు ఉరిమిచూస్తూ గద్దించి నిర్భయంగా సూరయ్య.

అతడికేం భయమా కావేర్ని చూస్తే? గుండెలుతీసిన బంటు— జడిసేవాడా? ఈలాంటి కావేరిగీవేరులకు?

అతడు గుడ్లురిమిచూడ్డం — ఉగ్రంగా మాట్లాడ్డం కాటేరమ్మకు యెన్నడూ కలుగనంత భయం కలిగించాయి. ఏమి చెప్పడానికి తోచకుండా పెదిమెలు తడుపుకుంటూ వున్నది. పాపము తత్తఅపాటుతో— తెలుసుకోన్నాడామె లక్షణాలు ఆమోటుగాడు. ఇదే సమయం. బాగా బెదరు పుట్టించాలనుకున్నాడు. పరుగెత్తేవాళ్ళనుచూస్తే తరిమేవాళ్ళకి ధైర్యం యెక్కువకదూ?

"ఏమీ? పలకవు? అడిగినదానికి బదులుచెప్పు. తరవాత నీ సంగతినిగురించి ఆలోచిస్తా" అన్నాడతడు.

చెప్పడానికేముంది? ఏదీతోచలేదామెకు— ఎట్లానో కొంచెం ధైర్యంతెచ్చుకొని హీనస్వరంతో "మా అక్క వడ్లిస్తూ వున్నాది. తమ్ముడు కట్టెలు తెచ్చి వేస్తూవున్నాడు" అన్నది.

"అయితే యేం వద్దంటావా? యీమాట చెప్పాలని వచ్చావా?" అన్నాడతడు కోపంతో పండ్లు కొరుకుతూను.

"కాదు కాదు. మన్నించాలె. మీకు పైవెచ్చానికేమైనా కావలస్తే అడిగి పోయి తెచ్చివ్వాలెనని వచ్చాను, అడగడానికి" అన్నది. డంబాలుకొట్టుతూ అతణ్ణి చంపడానికని వచ్చిన ఆమహాతల్లి.

ఆమాటలు విని లోలోపల సంతోషంపొందాడు సూరయ్య. బయిటితలంపు తెలీనీకుండా "ఓసి! నీటస్సాగోయ్యా— బుద్ధిలేనిదానా? ఇన్నాళ్లెక్కడపడి చచ్చివుండినావు? పైవెచ్చంఖర్చులు అక్కరలేదనుకొన్నావా? పో! వేగిరంగా తీసుకొనిరా! నెలకు ముప్పైరూపాయిలకి తక్కువలేకుండా కావలసి వుంటుంది. నెలనెలకు తప్పకుండా తెచ్చియిస్తూవుండు. ఇంక నిలవవద్దు. పోయి రూపాయీలు పట్టుకొనిరా" అని చాలా దర్జాగా ఆజ్ఞాపించాడాయన.

"వినయంతో చేతులుజోడించి మ్రొక్కి "చిత్తం తెస్తాను, పోయి. యెప్పుడూ యిల్లై యిచ్చుకొంటూ వుంటాను" అని చెప్పి మెల్లగా అతడి వశంలోనుండి తప్పించుకొని చాటుకు వచ్చినంతట పులినాకి విడిచిపెట్టిన మేకచందంగా, గండంగడిచి గట్టెక్కాను బ్రతుకు జీవుడా అని పరుగుపరుగున అక్కయింటికివచ్చిందా కాటేరమ్మ.

ఎదుటికివచ్చి నిల్చిన చెల్లెల్ని చూచింది పోలేరమ్మ. లక్షణాల్ని పట్టి యేదో పరాభవం పొంది వచ్చిందని గ్రహించింది.

"ఏమి చెల్లా? పోయినపని అయిందా? అతణ్ణి చంపి వచ్చావా? మాకు కష్టంతప్పిస్తావనే ఆశతో నీ రాకకు యెదురుచూస్తూన్నాం మేము. ఏమైంది?" అని అడిగింది.

కాటేరమ్మ కొంచెంసేపు మౌనంగావుండి నిట్టూర్పువుచ్చి "చంపాలేదు. గింపాలేదు. వాడు చచ్చేవాడా? అయ్యో! ఆసంగతి, నేను పడ్డకష్టాలు యేంజెప్పేది? బ్రతికి వచ్చి మిమ్మల్ని మళ్ళీచూస్తానని నేను తలంచనేలేదు. ఎట్లో తప్పించుకొనివచ్చి యిక్కడ మీయెదటపడ్డాను. మీరుచెప్పినమాటలు వినకుండా గర్వంతో పోయినందుకు తగిన అనుభవంకలిగింది. నేను పోయినపుడు వాడు లేడు. వస్తే చంపాలని తలుపుమూల్లో దాగుకొని కనిపెట్టుకొని వుండినాను— వాడు బయటికిపోయివుండి వాకిటికి రాగానే, యెట్లా తెల్సుకొన్నాడో తెల్సుకొన్నాడు నేను తనయింట్లోకి వచ్చివుండడం— గడపలోనె నిలిచి భార్యను పిలిచి నాపేరు చెప్పి— దాన్ని పట్టుకొని కట్టెయ్యి— తర్వాత తగినపని చేస్తానన్నాడు— ఆ దుర్మార్గురాలు— వాడిపెండ్లాం "ఇదిగో! వస్తున్నా పట్టికట్టేస్తా" నన్నది— ఇంక నాఆటలు సాగవని వళ్లు పనురుపుట్టడంవల్ల యెదటబడి బతిమాలి మంచిమాటల్తో తప్పించుకోవడం మేలని అతడి ముందుకు పోయినాను— వాడు నన్నుచూచి గర్వంతో బెదరించి నాసమాచారం విచారించి చంపడానికి చూచాడు— నేను పయివెచ్చం తెచ్చి యిస్తానని—ఎంతకావలెనో అడగడానికి వచ్చానని, చెప్పి ఒప్పించి ఉపాయంగా తప్పించుకొని బతికి బయటపడ్డాను— ఇంక యివ్వకుంటే తప్పదు— కొంచెం ఉండండి, నేను రూపాయీలు తెస్తాను— అందరం కలిసి పోయి చెల్లించివస్తాం" అనింది కాటేరమ్మ—

ఆమె చెప్పిందంతావిని పోలే

## దక్షారామము

17-2-1936-వ తేదీని పూర్వాహ్ణము 11-30 గంటలకు దక్షారామ భీమేశ్వర స్వామి సందర్శనార్థం గాను రాజమండ్రీ నుంచి బయల్దేరి వెళ్ళాను.

పామరులు పసిపిల్లలు దక్షారామాన్ని ద్రాక్షారామం అని అంటారు. కాని అక్కడ నేడు ద్రాక్షాలతలూ లేవు, దక్షుడూ లేడు. అంతా తమలపాకుల తోటలమయం. కాబట్టి గమ్యస్థానపు గాలి పీల్చడంలో లేదమలపాకు తొలి కనుబండువుగా కనిపించింది. ద్రాక్షారపు భీమన్న అభీమన్న ఆలా పైకి ఆకాశంలోకి అనంతంగా ఎదిగిపోవడం, మఱి ఎదిగిపోకుండా అభీమన్న శిరోపరిసీల కొట్టడం ఒక్కడితో అభీమన్న ఎదుగాగిపోవడం ఈ మొదలైన కఠోరగాథ ఏనాటిదో అన్నట్టు నామనస్సులోనుంచి మాయమైపోయింది.

ఆలా లేదమలపాకు చూపుతోనే దేవళం ప్రవేశించాను. దక్షారామంలోని లింగస్వరూపం పాలరాయిమీద అక్కడక్కడ నలుపుచారలు గలిగి వుండి నిలువునా నిలుచున్న శివస్వరూపం. ఆ నలుపు చారలు ఏమిటిఅని అడిగితే పూజారి అన్నాడు 'పులిచర్మం కాదండీ! దాని డోలు ఆడోరియా'అని అన్నాడు. ఎంత ప్రత్యక్షానుభూతితో అతగాడు అర్చిస్తాడో కదా అమ్మహాలింగాన్ని అని అనుకొని నేనున్నూ నా నిజమైన భక్తిని నిమడించుకొని తిలకించాను.

తిలకించినకొద్దీ మిక్కిలి మనోరంజకంగా అమ్మహాలింగప్రదర్శనం పొడగట్టింది. నాకు అంత మనోరంజకంగా నాడలా గోచరించడానికి, పూర్వాపర సందర్భాలు నా ప్రయాణంలోగాని, జీవితంలోగాని, పఠనంలోగాని, పరామర్శించడంలోగాని వున్నాయా అంటే ఏమీ తట్టవాయె. ఎంతసేపు ఆలోచించినా తెనుగునోట ప్రసిద్ధిగన్న ఉపమానం 'ద్రాక్షారపు భీమన్నలా' అనేది తప్పిస్తే మఱో శ్రుతిగాని, స్మృతిగాని తోచదాయె. ఒక్క నిమేషం ఉక్కపోసినట్లుకూడా అయింది. కాని అంతలో ఎక్కణ్ణుంచో చల్లటిగాలి కూడవీచింది. కుమారారామంలో ఊపిన ఉయ్యాలా మంటపంయొక్క చలనోద్భూతపవన కిశోరమా అని తలపోశాను. చుట్టూ చూచాను. కొన్ని వందల స్తంభాలు కనిపించినాయి. ఏమిటాస్థంభాలు, ఆ కట్టడం అన్నాను. అది సోమవారపు మంటపం,

---

రమ్మ, పోతరాజు ఒకరిమొగం ఒకరు చూచుకొని నవ్వుకొన్నారు- "చెప్తే వినకపొయ్యావు- తగిన ప్రాయశ్చిత్తం అయింది- లేని బెడద తెచ్చిపెట్టుకొన్నావు- సరే! పో! రూపాయిలు తీసికొనిరా- అందరం ఒకేసారి పోయి చెల్లించి వస్తాం" అన్నారు వాళ్లు. కాటేరు పోయి తెచ్చింది-

ముగ్గురుచేరి తీసికొనిపోయి సూరయ్య కర్పణంచేసి దండంబెట్టి చెంపలుగొట్టుకొని తమచోట్లకు పొయ్యారు, ఆదేవతలు ముగ్గురున్నూ- సూరయ్యకు మంచికాలం. అతడికి చచ్చేవరకు ఆలాగే జరుగుతూ వుండింది.

ఇంకోవిశేషం ఏమంటె, ఎన్నాళ్ళనుంచో కట్టకను, ఈనకను వుండిన—కాటేరి—సూరయ్యయెనుము—కట్టునిలిచి చూలై యీనింది మంచి దూడను- అదిమొదలుగా పూటకు ముంతెడు పాలు యిస్తూవుండడంవల్ల అతడికి పాడిలేదనే కొరత తప్పిపోయింది- కావలసినంతపాలు, పెరుగు, నేయి అనుభవిస్తూ సుఖంగా వుండినాడు.

---

## రిజిస్టరు దస్తావేజు పోయింది.

ది 26-6-1940 తేదీని కాకినాడ గాంధినగరం కాపురస్తులు [illegible]ట్లపల్లి సుబ్బారావుగారు మర్రిపూడి కాపురస్తులు రాజనాల అన్నపూర్ణగారికి వ్రాసిన సెం 1303 రుగల రిజిష్టరీ దస్తావేజు పూరా పరిష్కారముకు నెంబరు 1040 రాలు ది 9-1-1941 తేదీ వసూలు యిచ్చి చెల్లు వ్రాయించుకున్నారు. అది పొరపాటున పోయినది గనుక ఎవరికయినా కనుపించినయెడల తీసుకువచ్చి యిచ్చినయెడల తోచిన బహుమానం యివ్వబడును. యిందునుగురించి పోలీసు వారికిగూడా రిపోర్టు పంపినాము. రాజనాల అన్నపూర్ణగారు బాకీలేనట్లు ఈమెకు యిచ్చినారు.

కొత్తపల్లి సూర్యకాంతం,
జగ్గన్న తిమ్మాపురం.

కాని ప్రకృతంలో గొల్లస్థంభాలు అని ప్రజలంటూ వున్నారు అని పూజారి తేట తెనుగ్గా వివరించాడు. 'దాక్షారామం' అన్న పేరులోని మార్పునకు తగ్గట్టే వున్నది యీ 'గొల్ల స్తంభాలు' అన్న ప్రకృతపు పేరున్నూ అని వినూత్న వికాసం హృదయంలోని దాన్ని మేనుమీదకు వుబికింప చేసుకున్నాను.

'గొల్ల స్తంభాలు!' మనోహరమైన ఆ శబ్ద ప్రయోగము అని మనస్సేదో యువ్విళ్ళూట వాల్లాడిపోయింది. గొల్ల స్తంభాలంట తెనుగునాట చక్కని చిన్నప్పటి ఆట. ఆటేకాదు ఆటలోతట్టే చక్కని పాట.

'చల్లో యమ్మ చల్ల!'
మల్లెపువ్వులకు
తెల్లమీటి విల
సిల్లెడు కమ్మని
చల్లో యమ్మ చల్ల!
పెరుగు చాల బం
గరు ఘటముల నిడి
గిరగిర కవ్వము దిరుగగ తఱచిన
చల్లో యమ్మ చల్ల!
వుక్కా కొంతి పాడి
గుప్పున నిమ్మ
కప్పుడు వేసిన చొప్పున నొప్పెడు
చల్లో యమ్మ చల్ల!
బుడ బుడ మను పా
ల్కడలిని వెడలి
అడరెడు కడు మేలమృతసారమగు
చల్లో యమ్మ చల్ల!
తిరముగ నాత్రేయ
పురిని కాపురముండి మహా
సేరువుగ జేసిన
చల్లో యమ్మ చల్ల!

ఈయది మిక్కిలి పురాతనపాట. దీనిని వ్రాతలో కనుగొనాలి అంటే మదరాసులో వున్న ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారము నందలి వ్రాత ప్రతులు తిరగవేనూ లేమో! ఆపాట నాకు ద్రాక్షారామ భీమేశ్వరాలయ సోమారమంటప సందర్శనోత్సవ సమయమున జ్ఞాపకము వచ్చి నన్నపారానందాబ్ధి నోలలాడించిందంటే ఈమానసిక ప్రవృత్తికి దూరభారముల నే అడ్డంకులెంతమాత్రం లేవని వేరే నేను అనాలా! చల్లో యమ్మ చల్ల! సరే.

చల్లమ్మే గొల్లపడుచు? ఆపె యొక్కణ్ణుంచి మనల్ని తొంగి చూడకలదు? ఆ స్తంభాల చాటునుంచి ఆనాడు నాకట్టెదుట దాగుడుమూతలాడుతోందా? అహో బృందావనంలో నెమకపలసిన గోపికను ద్రాక్షారామంలో వెతుకుతూన్నాను. ఎంతటి వెఱ్ఱిచేష్ట!

అయినప్పటికిన్నీ 16000 మంది గోపికలు రాధాసమేతంగా దక్షారామ భీమలింగని గుడిలోని సోమారపు మంటప స్తంభాలు పట్టుకుని గొల్ల స్తంభాలాట ఆడుతూ నాముందు సాక్షాత్కరించినారు. సాక్షాత్కరించి భీమా!

బుడ బుడ మను పా
ల్కడలిని వెడలి
అడరెడు కడు మే
లమృతసారమగు చల్లో యమ్మ చల్ల!

అని పాట ముగిస్తూవుంటే 16001 తరగ పాల్కడలిపై పడి పోతూ నన్ను 'క్షీరారామం'కు జేర్చే సోపానపాళిగా పరిణమించింది.

—కవికొండల వెంకటరావు.
(మాతృసేవ).

* * *

## పాదుషాపాదుకలకు ప్రాయశ్చిత్తం

రామాయణకాలంలో మన భారతదేశంలో ఒక పాదుకాపట్టాభిషేకం నడిచింది.

పాదుకలు అంటే సాధారణంగా పాంకోళ్లు అని అర్థం చెబుతారు. ఇటీవల ఆ శబ్దాన్ని పాదరక్షలకు పర్యాయపదంగా వాడడం పరిపాటి ఐపోయింది.

బంగారంతో పాదుకలు చేయించి, వానికి అడవిలో అన్నగారి పాదస్పర్శ చేయించి, వానిని ఇంటికి కొనిపోయాడు భ్రాతృభక్తుడు భరతుడు.

రాముని పాదుకలు తనవద్ద వున్నా భరతుడు అయోధ్యలో కాలు పెట్టలేదు. నందిగ్రామంలోనే వుండిపోయాడు. రాముని పాదుకల్ని సింహాసనంమీద వుంచి వాని పేరు మీదుగా భరతుడు రాజ్యం చేస్తూవచ్చాడు.

హిందూమత విద్వేషి ఐన ఔరంగజేబు మొగలు సామ్రాజ్య చక్రవర్తి ఐనప్పుడు తన పాదుకలకుకూడా శ్రీరాముని పాదుకలకువలెనే అనంతగౌరవం కూర్చుకోవాలని ముచ్చటపడ్డాడు.

పాదుకలకు పట్టాభిషేక లాభం ఒనగూడేసరికి రాముడు అరణ్యవాసి. ఔరంగజేబుకు అరణ్యవాసఖర్మం లేదు. అతడు పాదుషా.

అరణ్యవాసి అయిన రాముడి పాదుకలకే అంత గౌరవం జరిగినప్పుడు పాదుషా ఐన తన యొక్క పాదుకలకు ఇంకా అంతకంటె ఎక్కువ గౌరవం జరగాలని ఔరంగజేబుకు కోరిక పుట్టింది.

కోరిక పుట్టడమే తడవుగా అతడు తన కాలి స్లిప్పరు ఒకదానిని ఏనుగు మీది హౌదాలో వుంచాడు. దానికి రాజ లాంఛనా లన్నీ ముస్తాబు చేశాడు.

కాలి బలాన్ని, అశ్వికబలాన్ని తోడిచ్చి ఆ ఏనుగు వెంట పంపాడు.

ఆ ఏనుగు ఔరంగజేబుయొక్క సామంత రాజ్యాల కన్నిటికి పోతూ వుండేది.

చక్రవర్తి పాదుకను భరించిన ఏనుగు ఉత్సవంతో తన రాజ్యపు పొలిమేరలోకి రావడంతోటే ప్రతి సామంత రాజూ ఎదురుగా వచ్చి ఆ యేనుక్కి, కూడా వచ్చిన పరివారానికి ఎదురుకోలిచ్చి ఊళ్లోకి కొనిపోవాలి.

కొనిపోయి ఏనుగుమీది స్లిప్పరు తెచ్చి సింహాసనంమీద వుంచి దానిని పూజించి కప్పమూ వగైరాలు చెల్లించాలి.

ఇదీ ఏర్పాటు. సామంతరాజులందరూ ఈ ఏర్పాటు ప్రకారం చేస్తూవుండే వారు.

దక్షిణాదిని మధురానగరంలో రంగకృష్ణ ముద్దు వీరప్ప నాయడు అనే తెలుగు నాయకరాజు రాజ్యం చేస్తూవుండగా చక్రవర్తి చెప్పుమోసే ఏనుగు, దాని వెనక సేన మధుర నాయక రాజ్యంలో ప్రవేశించింది.

నాయుడు అభిమానధనుడు. కాగా, చక్రవర్తి స్లిప్పర్ని తన సింహాసనంమీద వుంచి తన సింహాసనాన్ని మలినపరచడానికి అతనికి ఇష్టం లేకపోయింది.

ఏదో మసి పూసి మాయ చేసి ఈ ఆచారాన్ని మానిపించి చక్రవర్తికి బుద్ధి చెప్పాలని నాయడికి తోచింది.

కాబట్టి తన రాజ్యపు పొలిమేరలో అతడు ఆ ఏనుగుకి ఎదుర్కోలు చేయలేదు.

ఒక సేవకుణ్ణిపంపి తనకు జబ్బుగా వుందనీ, అంచేత వచ్చి ఎదురు సన్నాహం చేయలేకపోయాననీ నాయడు ఔరంగజేబు తాబేదారులకు వర్తమానం చేశాడు.

వారు ఆ సంగతి నిజమే అనుకుని ఏనుగుని తీసుకుని సరాసరి నాయడి రాజధానీనగరానికి వచ్చిచేశారు. అక్కడయినా నాయడు వచ్చి వారికి స్వాగతం చేయలేదు. తనకు జబ్బు బాగా ఎక్కువైంది కాబట్టి అసలే కదలలేక పోతున్నానని నాయడు కబురు చేశాడు.

అందుమీద ఔరంగజేబు సరదారులు ఏనుగుమీదనుంచి చక్రవర్తి స్లిప్పరు దింపి, కోటలో ప్రవేశించి దానిని నాయడి సింహాసనం వద్దకు కొనిపోయారు.

పోయి చూస్తురు కదా, నాయడు ఎట్టి జబ్బుకాని లేకుండా సింహాసనం మీద కూర్చుండి కొలువుతీరి వున్నాడు.

వారికి చాలా ఆశ్చర్యం వేసింది. ఆశ్చర్యంతోనే వారు సింహాసనం చెంతకు వెళ్లారు. వారిని చూసి నాయడు లేవడం మొదలైన ఉచిత మర్యాద లేమీ చేయలేదు.

అందుకు వారికి ఆగ్రహంవచ్చింది. ఆగ్రహంతోనే వారు చక్రవర్తిస్లిప్పర్ని నాయడిదగ్గరగా తీసుకువెళ్లారు.

అప్పుడు నాయడు పెద్ద గొంతుకతో ఆజ్ఞాపూర్వకంగా ఆస్లిప్పరును కింద పెట్టమన్నాడు.

తన ఆజ్ఞ పాటించకపోతే చంపుతానన్నాడు. చకితులైపోయి వారు దానిని అతని పాదాలవద్ద వుంచారు. చిరకాలంగా ఏనుగునెక్కుతూవుండిన ఆ చెప్పును అప్పుడు తన పాదాలికి తొడుక్కుని నాయడు అధికారపూర్వకంగా వారితో ఇట్లా అన్నాడు:

'మీ చక్రవర్తి ఏమనుకున్నాడు? నాకు రెండు చెప్పులు అవసరమైవుండగా ఒక్క చెప్పే పంపాడేమిటి?'

ఈ మాటలకు వారికి చాలాకోపం వచ్చింది. కాని ఏం చేస్తారు?

ఈలోగా నాయడి ఆజ్ఞ ప్రకారం అతని సైనికులు ఏనుగుతోవచ్చి బయట వున్న మొగలు సైనికుల్ని తుద ముట్టించారు.

చావగా మిగిలినవారు పారిపోయి ఔరంగజేబుతో ఈ గొడవ అంతా చెప్పుకున్నారు.

తన పాదుకకు పట్టాభిషేక ప్రాయశ్చిత్తం చేసిన తెలుగునాయకుడి మీద చక్రవర్తి మండిపడ్డాడు. కాని దగ్గరలో మహారాష్ట్రుల గొడవ ఎక్కువ కావడం వల్ల దూరాన్నివున్న తెలుగునాయణ్ణి అతడు ఏమీ చేయలేకపోయాడు.

నాయణ్ణి ఏమీ చేయలేక పోవడమే కాకుండా, అంతటినుంచీ తన స్లిప్పరుని ఏనుగుమీద ఎక్కించి సామంతరాజుల వద్దకు పంపే ఆచారం కూడా విరమించుకున్నాడు.

—ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.

(వాణి.)

Printed at the Andhrabhumi Printing Works, 36 Mukatal Street. Vepery P.O, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.